ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక

హేవిళంబి సంవత్సరము శ్రావణ - భాద్రపద మాసములు

శ్రీ

# ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక

(Journal of the Telugu Academy)

చందా సంవత్సరమునకు మూఁడు రూపాయలు

సంపుటము ౪౬ | హేవిలంబి సంవత్సరము<br>శ్రావణ - భాద్రపదమాసములు | సంచిక ౩

అముద్రితవాఙ్మయము

## నివర్తి శేషాచలపతికవి

(చరిత్ర కెక్కని చరితార్థుఁడు)

డాక్టరు. యస్వీ జోగారావు, ఎమ్. ఏ., పిహెచ్. డి.

క్రీ. శ. 1684–1712 సం॥ల నడుమ తంజావూరి నేలిన మహారాష్ట్రప్రభు వగు శహాజీ యాస్థానమున వెలసిన శాహరాజవిలాసము[1] సరస్వతీకల్యాణము[2] నను రెండు తెలుఁగు యక్షగాననాటకములు, శేషాచలపతి యను కవి రచించినవిగాఁ గన్పట్టుచున్నవి. రెండును అముద్రితములు. అందు శాహరాజవిలాసమున శేషాచలపతి 'అష్టభాషాకవిత్వంబు లమరుసుకృతి' యనిమాత్రమే తెలియవచ్చినది.

సరస్వతీకల్యాణావతారికయం దితనిఁ గూర్చి–

'ప్రతిష్ఠైకపాత్ర భారద్వాజగోత్ర
పతి సుచారిత్రుఁ డాపస్తంబ సూత్రుఁ
డనఘు నివర్తి (నివృత్తి) వంశాబ్ధిచంద్రుండు

1. తంజావూరు సరస్వతీమహాలు కేటలాగు నం. 632
2. „ „ „ 651–657

వినయనయశ్రీవివేకసాంద్రుండు
ద్వాదశీముఖ్యాన్నదానప్రసన్న
సాదరహృదయుండు సాభ్యుదయుండు
నగు చొక్కనాథు (థ) మహామాత్యనాథు (థ)
సుగుణ (ణి) సత్పుత్రుండు సుజనమిత్రుండు
చిరపుణ్యారతమతి 'శేషాచలపతి'

అని కలదు. దీనివిబట్టి యీతఁడు నివర్తివంశ్యుఁ డనియు, నీతనిసూత్ర గోత్రము లాపస్తంబభారద్వాజార్షము లనియుఁ, దండ్రి నమాత్యశబ్ద వాచ్యునిగాఁ జేర్కొనియుండుటచే నియోగి కానోపు ననియుఁ దేలుచున్నది. కాని యితనితండ్రి చొక్కనాథుని (క్రీ. శ. 1659–1682 సం॥ల నడుమ మధుర నేలిన నాయకరాజు) యమాత్యుఁడా, లేక యతని పేరే చొక్కనాథామాత్యుఁడా యని శంక వొడముచున్నది. శాహజీయ మను (తం॥ స॥ మ॥ కే॥ నం॥ 468) శృంగారపదముల గ్రంథము చివర నొకపదమున 'చొక్కనాథపాలాశాహేంద్రుండు' అని కలదు. ఆ పదకర్త పేరు చొక్కనాథుఁడై యుండును. అతఁడు శాహజీ యాస్థాని కానచ్చును. అతఁడే పై శేషాచలపతితండ్రి యగునేమో !

శహాజీ రాజపురవిద్వత్పరిషత్తున గణనీయుఁ డగు రామభద్ర దీక్షితునకు గురుస్థాన మైనయతఁ డొకఁడు చొక్కనాథదీక్షితనామ ధేయుఁడు గలఁడు. 1 అతనికిని యీ శేషాచలపతికిని బితాపుత్రసంబంధము గలదో లేదో తెలియదు.

ఇఁక నొకవిశేషము: శహాజీయాస్థానమున నాంధ్రపాణిని బిరుదాంచితుఁ డగు నివృత్తి శేషాచలపతికృతములుగా వెలసిన సంస్కృత

1. Vide Indian Antiqury Vol. 33.

గ్రంథములు రెండు గన్పట్టుచున్నవి. అవి భోసలకోసలేంద్రచరితము[1] ఆంధ్రవ్యాకరణము[2] ననునవి. అందు భోసలకోసలేంద్రచరితమునం దత్కర్తగుఱించి యవతారికలో నిట్లున్నది.

'నాయాసం కవనే తతోఽపి కఠినం కావ్యం తతో రూపకమ్
తస్మాద్ధన్యమతః పదధ్వనిరసైః వాగ్వైఖరీజీవితమ్
తద్రామాయణభాసి మజ్జయకథం జల్పాంధ్రవాక్పాణినే
శ్రీశేషాచలపత్యమాత్యకుశలోఽస్మీత్యాహ శాహాధిపః॥'

'శాహేంద్రదత్త శిబికాకనకాభిషేక
సంభావనారుణభిద ప్రతికార హేతోః
యత్సాహసం విరచయే నను తత్రవాణీ
త్వత్తోఽధికం ప్రతిభువం కలయే న నూనమ్॥'

అందే ద్వితీయసర్గాంతమున నిట్లు కలదు-

'శ్రీభోజో నిజగోత్రకారణభరద్వాజో నివృత్త్యన్వయా
ద్య శ్రీ వేంకటపత్యమాత్యతిలకా జ్జాతోఽక్క దేవీవిభో
శ్రీ శేషాచలపత్యభిఖ్యకృతినా స్తస్యాంధ్రవాక్పాణినే
కావ్యే భోసలకోసలేంద్రచరితే సర్గే ద్వితీయోఽభవత్॥'

ఆంధ్రవ్యాకరణగ్రంథారంభమున నిట్లు గలదు-

'శ్రీశం దేవ ముపాస్య శేషసుమతి స్సర్వాంశ్చ భాషావిదః
కావ్యాదివ్యవహార చారు చతురాం మత్వాంధ్రభాషాంచిరాత్
తాం వ్యుత్పాదయ దంధ్రపాణిని సమస్తోపకారీభవ
ఆంధ్రవ్యాకరణం గణైర్మునిమతై స్సాకం వ్యతానీద్ధ్రువమ్॥'

మఱియు శహాజీరతీకల్యాణమున నొక ప్రతిలో (తం॥ స॥ మ॥ ప్రతి సం. 541) సితం డిట్లు స్మరింపఁబడినాఁడు.

---

1. తం॥ స॥ మ॥ సంస్కృతగ్రంథ వివరణిక-సం. VIII, నం. 4238
2. తం॥ స॥ మ॥ తెలుఁగు గ్రంథముల కే. నం. 773-774

'.........నందనకావ్యాదినిపుణు
భ (న) వ్యాంధ్రపాణిని నామాదిబిరుదు
భవ్య శేషాచలపతిముఖ్యబుధుల
హారకేయూరాగ్రహారహేమాశ్వ
వారణశిబికాదివాహనా లొసఁగి
నయలీలఁ బాలించు నయకీర్తిశాలి.'
(ఆ నయకీర్తిశాలి శహాజీ)

ఇతఁడు శహాజీ కర్వాచీనుఁ డైన జయసింహభూపతి కాశ్రితుఁ డగు నెల్లూరు శివరామకవికి గురు వైనట్లు శివరామకవికృతి కామకళానిధినుండి యీ క్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది.

'సకలాంధ్రోత్తల కాంధ్రపాణిని యనన్ శాస్త్రంబు గల్పించి త
త్ప్రకృతిప్రత్యయనిర్ణయంబుకొఱకై భాష్యంబుఁ గావించి దే
శికుఁడై రాజులచేతఁ బూజఁ గొను నా శేషాచలర్షిన్ నివృ
త్తికులస్వామిని మద్గురున్ గొలుతు భక్తిన్ మానసాబ్జంబునన్.'

కాఁగా నీ ఆంధ్రపాణిని శేషాచలపతియు యక్షగాననాటకకర్త యగు శేషాచలపతియు నొక్కఁడేనా కాదా యనునది ప్రకృత ముదయించుప్రశ్న. ఇరువురకు నింటిపేళ్లు (సరస్వతీకల్యాణమున 'నివర్తి' యని యున్నది కాని యట నివృత్తి యని యున్నను సరిపోవును) గోత్రము, రాజాశ్రయాదివిషయములందు సామ్యము గలదు. ఆంధ్రగ్రంథకర్తయు సంస్కృతపాండిత్యము గలవాఁడని తత్కృతులు సాక్ష్యమిచ్చుచున్నవి. కాని శేషాచలపతికృతము లనఁబడు నా సంస్కృతాంధ్రగ్రంథములు నాల్గిట నొకదానియందును దదితరగ్రంథప్రశంస గన్పట్టదు. ఆంధ్రగ్రంథకర్త యాంధ్రపాణినిబిరుదము తన కున్నట్లెక్కడను సూచింపలేదు. పోనీ, కవి బాల్యమున నా తెలుఁగుకృతులు, నావలఁ బ్రౌఢుఁడై సంస్కృతాంధ్రవ్యాకరణపండితుఁడై, ఆంధ్రపాణిని

బిరుదాంచితుఁ డైనపిదప నే సంస్కృతగ్రంథములును రచించిన ట్లెంచిన నెంచవచ్చును. కాని భోసలకోసలీయమునఁ గవి తనతండ్రిపేరు వేంకటపత్యమాత్యుఁ డని చెప్పియున్నాఁడు. సరస్వతీకల్యాణమునఁ జొక్కనాథమహామాత్యనాథుఁడు కవితండ్రి యని యున్నది. అనఁగా నతఁడు చొక్కనాథనామధేయుఁడు గాక మధురచొక్కనాథనాయకుని యమాత్యుఁడైయుండు ననుకొన్నచో సరస్వతీకల్యాణకర్త యగు శేషాచలపతి తండ్రిపేరు వేంకటపతి యైయుండు ననవచ్చును. కాని మధురచొక్కనాథనాయకునకు వేంకటపతి యను నమాత్యుఁ డుండినట్లు తెలియవచ్చుటలేదు. తెలుఁగుగ్రంథములకర్త యగు శేషాచలపతి యాంధ్రపాణిని యగునా కాదా యన్నది నేఁటికిఁ దెమలని శంక. కాని తెలుఁగుగ్రంథములవిషయమునమాత్రము రెండు నొక్కతీరువి కనుకను, ఒక్కదానిలోఁ గవివివరములు లేకపోయినను రెండిటఁ గర్తృనామము, కృతిపతియగు శహాజీభవనవర్ణనప్రసంగములును సమానముగ నున్నవి కావున నీరెంటినిమాత్ర మేకకర్తృకములుగా గ్రహింపవచ్చును. అదే ప్రకృత మవసరమైన విషయము.

## గ్రంథసమీక్ష

1. శాహరాజవిలాసము :

ముందు గౌరీశంకరప్రశంస. అందు శాహభూవల్లభునకు శుభాశంసనము. తరువాత విఘ్నేశ్వరసంస్వతీస్తుతము, కృతిపతికి ధవళశోభనమంగళశాసనాదికము. ఆ శోభనములే షష్ఠ్యంతములుగను పనికివచ్చినవి.

త. 'శ్రీమత్త్ర్యంబకపుత్రముఖ్యులు సభాసీనుల్, ప్రవీణుల్ కవుల్
రామాదుల్, పతి సత్కళానిధి, సభారంగంబు సింహాసన
శ్రీ మీఱన్ దగు, శాహభూపతి మహాశృంగారభంగిన్ వసం
తామాత్యుల్ రతిరాజుఁ బోలు నిఁకధన్యంబయ్యె మా నాట్యముల్.'

కథాసంగ్రహ మొక సీసమునను, కృతిపతి (శహాజీ) వంశావతార మొక దీర్ఘద్విపదలోను జెప్పఁబడినవి. (అవి కేటలాగులో నుదాహృతములు.)

కథావిషయము:- శాహరాజు సేతుయాత్ర చేసికొని వచ్చి తంజాపురవీథులలో స్వారివెడలుటతోఁ గథారంభము. అపుడు కాంభోజరాజపుత్రి లీలావతి యతనిఁ జూచి మోహించినదఁట! ఇది యులాప్రబంధపు బెత్తుగడయే. తరువాత నామె విరహవేదన, దౌత్యము, ఎఱుకఘట్టము, ప్రేయసీప్రియుల సమాగమము శాహమహారాజకల్యాణాదులం దున్నట్లుగనే సాగును. కాంభోజరాజపత్ని విజయమాగధి, విద్యావతి యను యోగిని, కలావతి యను చెలికత్తె, సింగీసింగళ్లు, కటిక, బ్రాహ్మణభట్టు- ఇందువచ్చు నితరపాత్రలు.

రచన:- కవి ప్రౌఢపండితుఁ డని నిరూపించుచున్నది. 'అతఁ డష్టభాషాకవిత్వంబు లమరుసుకృతి' యఁట. ఇం దష్టభాషాప్రయోగము లేదు గాని, యిందు తెలుఁగున దరువులు గద్యపద్యములు గాక, సంస్కృతమున ననేకశ్లోకములు, వచనములు, నష్టపదులును సలక్షణముగా విరచింపఁబడినవి. తమిళకన్నడములం దొండు రెండు చిన్న ప్రసంగములును గలవు. కవి సాముద్రికశాస్త్రవిదునివలెను గన్పట్టును. తచ్ఛాస్త్రప్రసంగము కొంత గలదు. ప్రహ్లాదసాముద్రికమునుండి యొకయుదాహరణము గలదు. ఇందు సాధారణముగా దరువులచివర శాహరాజపరముగ 'శేషాచలకవినుత' యని యుండును. కవి తన కృతిని నాటక మని పేర్కొనినాఁడు.

విశేషములు:-

1. అష్టపదులరచనలోఁ గవికి గీతగోవిందమువైపు చూపు లేకపోలేదు.

ఒక యుదాహరణ :

'నవఘనసారపరాగవిభూషిత
నివ ధారయతి హి కాయం ।
శివ శివ చంపకరుచిసురుచిర మపి
జీవితమాత్రసహాయం । త్వా మనిశమ్॥
నవరుచివిద్రుమనిభ మధరదళ
యువతిమణి రిహ నూనం ।
అవిరత నిశ్వసితానిల వశతో
భవతి చానిలసమానం । త్వామనిశమ్॥
భాసురమతి కవి శేషాచలపతి
భణిత విహారవికాసం ।
భోసలశాహవిభో సకలకళా
భూ (షిత) సూక్తివిలాసం । త్వామనిశమ్॥

2. వెన్నెల పదము:—

'బాల మేలు మే లీవేళ
బాళి చాల మేలు దూలె । వెన్నెలారో॥
కొప్పున నున్న పూవులు
గుప్పునను రాలె నేమె వెన్నెలారో । యీ॥
కప్పురపు సురటితో
నిప్పులు రాలిన ట్లయ్యెనే । వెన్నెలారో॥'

3. శాహరాజు మన్నన నందుకొ౦ఆ కానాఁ డతనిని మోహించిన కాంత లి ట్లనుకొ నెడివారఁట !

'మేళవించిన వీణె కైకొని
మేటిపదములు వాడనో ।
తాళగతులకు నింపు నింపఁగ
తనరు నాట్యము లాడనో॥'

4. శాహరాజభవనవర్ణన చూర్ణిక-

'అజితల పరాజిత నానాదేశ రాజకుమార సమర్పిత కుమారీరత్న సహస్రేణ రంభాదివిబుధరంభోరూ నిగుంభిత జంభారిమందిర సౌభాగ్య సంభార ధిక్కార విజృంభణప్రియంభావుకం భావుకసంక్రమిత నికేతనం కేతనాదినిఖిలరాజలాంఛనబంధురం బంధురాజి రాజన్య సహస్రాజస్ర సంకుల యథోచితసభాజనకృత సభాజనం.

శ్లో॥ వీణావేణుమృదంగ మంగళకళాస్వానాపతత్కోకిలా
శారీకేకి (కుల) వధూకలస్వనకళా సంగీతనాట్యక్రమై
శ్చిత్రారోపితరూపభాజనజనం శృంగారసంయోజనం
శ్రీ శాహక్షితిపాలమౌళిభవనం చిత్రం శుభం రాజతే॥'

గమనిక:- సరస్వతీకల్యాణమునను నీచూర్ణికయు శ్లోకము యథాతథముగఁ గలవు.

2. సరస్వతీకల్యాణము :

ఏతద్గ్రంథావతారికయే శహాజీ జలక్రీడ, సతీపతి దానవిలాసము మొదలగు ననేకగ్రంథావతారికలకు మాదల యైనది. అది (గిరిరాజకవి సర్వాంగసుందరీవిలాసావతారికయందు నిందలి స్తోత్ర శ్లోకాలు గలవు.) స్తుత్యాదికము :-

జయ దేవకీపుత్ర । జయ దివ్యనుతిపాత్ర
జయ కృష్ణసుచరిత్ర । జయ జగన్మిత్ర
జయ శుభావహగాత్ర । జయ జగత్త్రికసూత్ర
జయ భానుశశినేత్ర । జయజితామిత్ర॥ ౧ etc.
శరణు శరణు జగద్విధాయక । శరణు శ్రీహరినాయకా
శరణు శరణు శుభప్రదాయక । శరణు గిరిజానాయక॥
మంగళం మహిషాసురమర్దని తే మంగళమ్॥
లంబోదర స్సర్వవిద్యాలంబో దరహాసన్ముఖ
బంధుర స్తుత్య సుగుణై ర్బంధుర స్తు భవ న్ముదే॥

శ్లో॥ నృత్యాకారగతైః కరాబ్జవలనై స్తాళాయుతైః కంకణ
ప్రక్వాణై శ్రుతితాం గతై ర్ముఖవలల్లోలంబమాలావృతై
ర్వీణాయా మృదుగీతిభిః పరవశాం శ్చాళీజనాః కుర్వతీ
వాగ్దేవీవదనాంబుజే నివసతు శ్రీ శాహాపృథ్వీపతేః॥

శ్లో॥ వందే తం దేవదేవం వరసురపటలీమౌళిమాణిక్యదీప
శ్రేణీనీరాజితశ్రీచరణసరసిజం ధ్యానయోగాదిభాజం
భక్తానా మీప్సితార్థాకలనపటుచతుర్బాహుశోభాంచితశ్రీ
చక్రాబ్జాదిప్రభాభి శ్శమితజగదఘం శాశ్వతం కృష్ణదేవమ్॥

శ్లో॥ చండ స్తాండవకాండశౌండమహిమాశుండాలతుండోన్నమ
చ్ఛుండాదండపిచండభాండవిహరత్కుండల్యఖండశ్రియే
తండోద్దండితచండడిండిమముఖోడిండీరషండై ర్వహా
త్కాండై ర్మండితగండమండలజటాఖండోఽస్తు చండీపతేః॥

శ్లో॥ శ్రీమానస్తు స శంకరో నిజశిరశ్చంద్రచ్యుతాచ్ఛామృత
ప్లావాకారబహిస్సముద్గతకృపానిష్యందహృష్యజ్జగత్
అన్యోన్యాకృతిభేదదుస్సహగతివ్యాఖ్యాత్మదాంపత్యభా
గన్వర్ధాత్మరనామరూపవిభవా స్తే భూయసే శ్రేయసే॥

శ్లో॥ శ్రియ మురుదిశ దాంతే శాహభూపాలమౌళే
కలితశుభదయా సః కృష్ణదేవస్యపీఠా
అభినవవనమాలామోదహృద్యానవద్యా
నిలపరిచయలబ్ధానందభక్తవ్రజస్య॥

శ్లో॥ శాహేంద్ర స్సకలానవద్యసుకలాపాండిత్యజాగ్రద్దిశో
హారాలంకృతదిగ్వధూకుచతటీకాశ్మీరదంచన్మహాః
అత్రత్యాః కవయ శ్చతుర్విధమహాసాహిత్యనిర్వాహకా
స్స్నేహం చే ద్దశరూపకాభినయధీపారంగతో రంగతః॥

(కృతిపతి) బిరుదుగద్య:-

'జయ జయాక్రాంతవిశ్రాణనరాధేయ
జయ జయైకమహీతలేశ్వరతనూజ
జయ జయోదారభోసలశాహరాజ॥'

తదుపరి యొకసూత్రధారవచనమున నిది 'శాహమహారాజ ప్రణీతంబైన' ట్లు గలదు. కాని దానితరువాతనే యున్న కథాసంగ్రహ ద్విపదలో నిది-

'చిరపుణ్యరతమతి శేషాచలపతి
వరశాహవిభుపేర వహించి దైవార
చారుశృంగారరసంబులు దీరు
లౌరా యనుచు మెచ్చ హర్షంబు హెచ్చ
మొల్లపువ్వులపొట్లములు విప్పినట్లు
చల్లగా పన్నీరు చల్లినతీరు
పరగు సరస్వతీపరిణయం బనెడు
సరసనాటకము లాస్యముల రాజిల్లి
భావముల్ దగువేషభాషాదు లమరఁ
గావించె భరతులు[1] గాయకుల్ మెచ్చ
నాచక్రవాళాచలాచలాచక్ర
మాచంద్రతారార్కమై యొప్పఁగాత'

అని శేషాచలపతికృతముగనే వక్కాణింపఁబడినది.

పై ద్విపదలో దీనికి భారతీపరిణయనాటక మనియు నామాంతరము పేర్కొనఁబడినది.

---

1. 'భరతశిష్యులు, భరతమతానుయాయులు, నటులు గూడ భరతు లని పిలువఁబడుచున్నారు' చూ. శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి 'ప్రాచీననాట్యశాస్త్రములు' అను వ్యాసము భారతి- సెప్టెంబరు, 1955; పుట 43.

కథాసంగ్రహద్విపదకుఁ బిదప వినాయకుని రాక యొకద్విపద లోను, దరువులో నిట్లు చెప్పఁబడినది.

ద్వి॥ 'పాశాంకుశంబులు పరగ హస్తముల
భాసురకనకప్రభలు విలసిల్లఁ
బొసఁగ లంబోదరంబున నాగవితతి
యసమానకాంతితో నాడుచుండంగ
వలనొప్పు మూషకవాహనం బెక్కి
వెలయ విఘ్నేశుండు వేడ్కతో వెడలె'॥

ద॥ తోడి రాగము — ఆది తాళము.

'ముదమునఁ గుండలములరుచు లమరఁగ
నిదె వెడలెను విఘ్నేశ్వరుఁ డిపుడు॥ ౧ etc.

ఈ ద్విపదయు నీ దరువే యనేక శహాజీకృతులందును, వాసు దేవకవిదిగా నూహింపఁబడిన పార్వతీపరిణయమునందును గలవు.

కథావిషయము:— సరస్వతీబ్రహ్మలు ప్రసిద్ధులైన పురాణదంప తులే కాని వారి కల్యాణకథ యిందుఁ గొన్నిమార్పు లందినది.

కథాసందర్భవిశేషములు :—

1. నారదశిష్యుఁ డగు విశారదుని ప్రవేశముతోఁ గథారంభ మగును. సూత్రధారుఁ డా పాత్రను బలుకరించును. విశారదుఁడు 'మద్గురో ర్నారద స్యాజ్ఞాం శ్రుత్వా నామ్నా విశారద నోఽహం సర స్వతీం దేవీం జ్ఞాతు మాగతవా నిహ॥' అనును. సూత్రధారుఁడు 'మాకు శ్లోకరూపముగాఁ జెప్పితే తెలియలేదు. భాషా రూపముగాఁ దెలియఁ బలకరించవయ్యా' యనును.

2. ధామరుకుఁడు— (ఢమరుకధారి యనఁగా నిట శకునపక్షి, ఎఱుకలు, పంబలు మొదలగువారు శాకునికజాతులకుఁ జెందినవారు,

శేషాచలపతి తన శాహరాజవిలాసమున నెఱుకతపాత్రను గల్పించి యుండెను గావున నిందు క్రొత్తదనమునకై యీ ఢామరుకపాత్రను బ్రవేశపెట్టియుండును.) వీడు సరస్వతికి శకునము జెప్ప వచ్చినాఁడఁట. వానిమాటలు: "మేలు భళా కార్య మిహ బలము కలుగుతుంది...
......ఈ మూల పంచవన్నెవచ్చి పలుకుచుంది... .....చారెడు పుల్లతీర్థం (తరవాణికాఁబోలు) పోయించండ యీ బిడ్డకు........ నీవు తలంచిన కార్యము జయం కలుగుతాది. శకునం నీకు యిటువంటి పిన్నవానిమీదనె మనసున్నది. ఈ సభవారి కందరికి జయం కలుగు తున్నది. ఈ సభాపతియైన శ్రీ శాహమహారాజావార్కి సకలాయు రారోగ్యబలంబులు గలుగుతాది. నా వాకు తప్పదు. రామకోణం గిని. ఈ మహారాజావార్కి పదహాఱుకోమాళ్ల భలం గలుగుతుంది. జయం జయం॥'

3. సరస్వతీపరమేష్ఠులకుఁ బరస్పరసౌందర్యముగూర్చి విన్న మాత్రనె విరహజ్వరము తగిలినదఁట!

4. భావజ్ఞుఁడు బ్రహ్మసఖుఁడు. కవి సాభిప్రాయముగనే యీ పేరు పెట్టియుండును. సావిత్రి బ్రహ్మగారికిఁ బ్రథమకళత్రము. బ్రహ్మకు నారదునివలన సరస్వతీసౌందర్యమంత్రోపదేశమైనది. ఆమెతోఁ గల్యాణము సంఘటించుభారము భావజ్ఞునిపైఁ బడినది. అది నిజముగా భారమే. దేవి సావిత్రికి సవతిని దెచ్చిపెట్టుటయు నందుల కామె సమ్మతినే స్వయముగా నభ్యర్థించుటయు సామాన్యమా మఱి! భావ జ్ఞుఁడు పవిత్రపాతివ్రత్యమాహాత్మ్యమునకు సావిత్రీదేవిని జెప్పి మఱి యొకరిని జెప్పవలెనని ముఖస్తుతి చేసి ముందటికాళ్లకు బంధము వేసి నాఁడు. ఆమె బ్రహ్మగారివద్దకు వచ్చుసరి కయ్యవా రాలోచన పాలు పోనియవస్థలో నుండుట, నారదుఁడు పలాయనము చిత్తగించుట, అసలు నారదుఁడు ముందుగా సావిత్రీదేవికడఁ దనపే రెత్తవద్దని భావజ్ఞుని

బతిమాలుకొనుట మున్నగుపట్టులు కవి సందర్భోచితీనిర్వాహకత్వ మును నిరూపించును.

5. జెట్టివారి (మల్లుల) ప్రసంగము:— కథాసందర్భముతోఁ బొందుపొసఁగకపోయినను కవి కాలప్రభావమునకు లోఁగి జెట్లసిగపట్ల గోత్రపుసన్ని వేశము నొకదానిని గల్పించెను. నారదుఁడు 'శాహరాజ పురంబున నిత్యనివాసముసేయు సరస్వతీసందర్శనంబునకు వచ్చుసమ యంబున మధ్యేమార్గమున మధ్యార్జునంబున జెట్టివాండ్లు తమలోఁ దాము పెనగులాటకు వచ్చేమార్గము'.

వారు 'రాజసభలఁ బేరుగొన్న మల్లు' లఁట. వారి వాలకము : 'దట్టిబిగియంగఁ గట్టి నీటున మష్టి (?) దుప్పటి వల్లెవాటును...... ....లిమ హంవీరతాయెతులు మెడల మెఱయుంగ......పిల్లజెట్టులు బిరుదుపావడ, తెల్లకుంచెలు ముందు నడువంగ...' ఒడళ్ల చాదు పట్టెలు చేతుల సానకత్తులుగా తొమ్ముబింకము, పిక్క పొంకము మెఱయించుచు వచ్చినారఁట.

వారి మాటలు :—

అన్నాజెట్టి:— ఓరి నాముందర నిలువలేవు, బిడ్డలుగలవాఁడవు. నాచేతి పెట్టుకు నొంటిదెబ్బకు నావలించెదవు, ఏడనైన పోయి బ్రదుకరా.

తిప్పాజెట్టి:—ఓరి అన్నాజెట్టి, నీవు నొకజెట్టికొడుకువలె మహాలావులుగా మాటలాడుకొంటావు......ఓరి యన్నిగా ! ఈ మహారాజు పుణ్యాన మొన్నటి మాఘములో బెండ్లాడితివి, నేటికి శోభనము చేసికోవలె నంటా వచ్చివుండావు.

అన్నా:— గొంతున వురాటం (ఉరిత్రాడు) వేస్తున్నానురా......ఓరి వజ్రముష్టితో బొడుస్తున్నా, తప్పించుకో......ఏది భాయి,

ఝు ఝు! ఓరి క్రిందబడితివే......'మా' అను విడిచెదగాని,
'మా' అను, 'మా' అను పుణ్యానికి విడిచిపెట్టెదగాని.

తిప్పా:— ఈ తేప లెస్సగా సాము చేసి దండెలు ద్రోసి, సంగడా లెత్తి గోతాం రొమ్ముపై ద్రోసికొని, లోడు రెండుచేతులా ద్రిప్పి, కంబము గట్టి, బాణాకత్తి పట్టాకత్తి దాడుకోలా త్రిప్పి యీ సామంతా సాధకము చేసి మరి నిన్ను గెలిచెదరా.........

త॥ సూత్రధారుఁడు:— 'ఎవ్వరోయి జెట్టివాండ్లు! క్రిందబడ్డవా రెవ్వరు, మీద బడ్డవా రెవ్వరు? క్రిందబడ్డవానికి బహుమానము' అని జెట్టిపాత్రలను బలుకరించుట కానవగును.

..... ఆ రోజులలో రాజాస్థానములందు జెట్టివాండ్ల పలుకుబడి హెచ్చుగా నుండినట్లు, వారును కవిగాయకనర్తకాదివైనోదికపరివారమువలెఁ బోషింపఁబడినట్లు తెలియనగును.

6. పండితప్రసంగములు:— నారదునకు మార్గమధ్యమున జెట్ల తరువాత విద్వాంసు లెదురై యిట్లు ప్రసంగించిరఁట— (వారు శాహరాజు నెఱుఁగుదురఁట!)

రంగుభట్లు:— మంగుభట్టా కథం శ్లోకం వక్తవ్యమ్?

మంగు:— 'ఏకాదశ్యాం న భుంజీయాత్
భుంజీయా త్సద్దిఎంటకం
నీరుల్లి మజ్జిగ సంయుక్తం
కోటియజ్ఞ ఫలం లభేత్॥

రంగు:— అహో గ్యతాభావేన రూపకం నమో నమః॥

మంగు:— అకటో వికటశ్చైవ కుంతీపుత్రో వినాయకః।
నకుల స్సహదేవశ్చ పంచైతే గోపిచందనే॥

రంగు:— అందలం భగవా న్విష్ణుం పల్లకీ మధుసూదనః
గుఱ్ఱం పుండరీకాక్షో నేసుగో గరుడధ్వజః॥

ఇదియుఁట పండితులవరుస. ఉదాహరింపలేదు కాని యీనాదుమ హాస్యముకొఱ కుద్దేశింపఁబడిన యత్యసభ్యము లగుపంక్తులు గలవు.

7. పెండ్లి కింద్రశివకేశవాదుల రాకలు వర్ణింపఁబడిన 'కర మునసొప్పఁ వజ్రమును గన్నులు వేయును', 'ఐరావతము నెక్కి హర్షములో రంభాదుల చారుశృంగారనాట్యములు మీఱ దేవేంద్రుఁడు వచ్చె' మొదలగు పద్యములు దరువులు నిందున్నవే. శహాజీ విఘ్నేశ్వరకల్యాణ రతికల్యాణాదులందును గన్పట్టును.

8. పెండ్లి శాహరాజేలుచుండిన కాలమునఁ దంజాపురి నైన దఁట! ఆ సందర్భమున శాహరాజభవనవర్ణన గల చూర్ణికయు శ్లోకము నిందలివే శాహరాజవిలాసమునను గన్పట్టును. ఇందలి చూర్ణికయందుమాత్రము ముందుగా నాల్గుపంక్తు లెక్కువ గలవు. అవి: 'ఇదం సకలలక్షణలక్షితం। లక్ష్మీనిత్యనివాసభవనం॥ కించ॥ అవిరళమద కందూల గండతల శుండాలకుల శుండానిర్గళ దనర్గళ కర శీకరనికరై ర్నిరంతరం మౌక్తికవితానిత వియదంతర ఘోటికా కోటికా। వరఖురముద్రార్వాణై ర్మహారాజ శాహరాజస్య బాహావిటంక విహారమాణ క్షోణిమయూరీ మేచక చకచకద్యుతిమతిప్రదాయకం...'

9. తంజాపురవర్ణన:—

'ఏవీథులను జూచినా వేదవేదాంత
శాస్త్రకోవిదసుప్రసంగఫణితి;
ఏదిక్కులను జూచినా దివ్యశృంగార
వనపుష్పసౌరభ మొనరుచుండు
ఏచాయలను జూచినా చకోరేక్షణా
చకచకద్యుతుల విస్మయము సేయు
ఏమార్గములఁ జూచినా మహోత్సవవాద్య
శబ్దముల్ చెవులకు సౌఖ్య మొసఁగు

భళిర భోసలశాహభూపాలుఁ డమరు
రాజధానిని దంజాపురంబుఁ జేరి
మా మనస్సారసంబు లున్మస్తకముగ
నురుతరానందవార్ధిలో నోలలాడు.'

రచన:— కవి ప్రౌఢుఁడే కాని కథకుఁ బౌరాణికతాప్రతిపత్తిని గల్పింపలేకపోయినాఁడు. ఇందు ద్విపదలు తఱచు దరువులు చిన్న చిన్నవి. అన్నిటికిని రాగములపేళ్లుదాహరింపఁబడలేదు కాని యున్నంతమట్టున కన్నియుఁ బ్రసిద్ధరాగములలోనే యున్నవి. సూత్రధారుని వచనములు, పాత్రల సంభాషణవచనములును గలవు. అందు నాఁటి తంజావూరుమాండలికవ్యవహారఫణితి బాగుగాఁ గన్పట్టును. సూత్రధారుఁడు పాత్రలను బలుకరించుట యున్నది. గ్రంథము మంచి నాటకపువాటము గలిగియున్నది.



డిండిమభట్టును జయింపఁ బోవు

# శ్రీనాథహృదయము

శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి.

వే శమ్యో నను కేశవిసరుతో నుమ్మగి
ల్లనియోదసమ్ము వడ్డనము సేయఁ
గట్టావితో వంటకము లుంచు తావులఁ
గదళీపలాశమ్ము కమరిగిల్ల
వేఁడిసోఁ కోర్వని వ్రేళ్ల నూదుచును దుం
దుడుకుతో నుడుకును మెడుకు జుత్తి
కడి మ్రింగువడక గ్రుక్కెఁడునీరు త్రావి ప
చ్చడుల వాచవి కేని జవినిగొనక
తెమలి సాపడి మన సాకతీలు గాఁగ
సరిగవలిపెంబు గట్టి, పచ్చడము గప్పి
కుండలమ్ములు చెవులందుఁ దాండవింప
గట్టునను ద్రేన్చె శ్రీనాథకవివరుండు.

రాఁచి అంపము పెట్టి రేఁచనే యనురీతి
తములపాకులకు సున్నమును రాఁచి
చీల్చి చెండాడనే చెలరేఁగి యనురీతి
వ్రీల్చి యీనెల బిట్టు విసరివైచి
వంచి చుట్టగఁ జుట్టివైవనే యనురీతి
నాకుపాయులు చుట్ట లమరఁ జేసి
నమలి మ్రింగక యుందునా యన్నరీతిని
వక్కాకుమడుపులు చక్క నమలి

వాదమున డిండిముని ముడివైచి పట్టి
యతని నెత్తురు పిండనే యనెడిరీతిఁ
దములపురసమ్ము నెఱ్ఱగా నుమిసి యుమిసి
వీడియము తీర్చెఁ గవిరాజు వేడ్కమీఱ. ౨

డిండిమభట్టు వాదమున డీకొనుసాహసకార్య మద్ది య
ట్లుండ మహేశదత్తమహిమోజ్జ్వల మైనది కంచుఢక్క నె
వ్వండు జయింపఁగాఁగలుగువాఁ డయినన్ బరదేవతావరం
బుండెను గాదె; దీని కిటు లుల్కఁగ నేటికి వెఱ్ఱిడెందమా! 3

ఎక్కడిగౌడదేశ మితఁ డెక్కడి కెక్కడనుండి వచ్చెఁ బే
రెక్కినయొక్కఢక్కను వహించి జయించుచుఁ బండితావళిన్
ధిక్కృతి సేయుచుండెఁ గడుధీరత, నీతనికంచుఢక్కలన్
జెక్కలుముక్క లౌనటులు సేయనిచోఁ బరు వింకఁ దక్కునే. ౪

పుణ్యగోదావరీవారిపూత మైన
యాంధ్రదేశానఁ గవిపండితాళి కిపుడు
కల వటంచు నీ డిండిమకవిని బ్రౌఢ
రాయలు వరించెనో కవిరా జటంచు. ౫

పుట్టించితి కవిగా నను
గట్టించితి ప్రౌఢమధురకావ్యము లెన్నో
మెట్టినదేశములన్ జే
పెట్టించితి నీదుకరుణపేరిమిఁ గాదే? ౬

అమ్మా! భారతి! అందరానిఫల మానా? యైన నాశింపఁ బో
నమ్మా! నీకరుణాకటాక్షలవదిగ్ధాత్ముండ నౌ నాకు నే
లమ్మా! యోటమి? యైన మానసము డోలాందోళితం బౌను మా
యమ్మా! యన్నిటి కీవె యుంటివిగదమ్మా తల్లి! వాగ్దేవతా! ౭

ఇరువురిలోన వాదమున నేరు పరాజితు లైరో వారి యా
బిరుదములున్ బహూకృతులుఁ బేరును బెంపును సుప్రతిష్ఠలున్
దిరపడు గెల్చుకొన్నకవిధీరున, కిద్ది పణంబు మాకు, నా
పరపతి నిల్పఁబెట్టఁగల భారము నీయదె సుమ్ము భారతీ! ౮

ఇది యొకతీరుకర్కశపరీక్షగ మానసముం గలంచుచు
న్నది జననీ! బిభీషికల కర్భకురీతిగఁ జేసితే నన్
బదిలము సుమ్ము నా పరిభవ మ్మది నీయది గాద నా జయం
బిదియును నీదె కాద? పరమేశ్వరి! తోఁచినరీతిఁ జేయుమీ! ౯

దేశదేశములెల్లఁ దిరిగి దిగ్విజయమ్మ
నెఱపి యార్జించిన చిరయశస్సు
సకలసంస్థానరాజన్యుల నొప్పించి
విలిచికొన్నట్టి నిర్మలయశస్సు
నిశితశాస్త్రార్థపాండిత్యశౌండత మించఁ
బూరించికొన్న యద్భుతయశస్సు
బహుకావ్యనిర్మాణభారతీసేవాత్త
గురుతరశస్తవిస్తరయశస్సు
కవికులసుదుర్లభంబు లౌ ఘనత లంది
వెలకు మీఱి చేకొన్న నిస్తులయశస్సు
నేఁటితో నాకసము నంటి నెగడుటో ర
సాతలము నంటి యణఁగుటో జరుగఁగలదు. ౧౦

పద్దెము లల్లుటో మధురభావము కూర్చుటో, యాశుధారలో
ముద్దులు మూటగట్టుటో యపూర్వనిమేషకృతుల్ రచించుటో
యొద్దిక శాస్త్రపాఠములో యొజ్జతనంబులో గాక తేఁకువన్
గద్దెల నెక్కి దిగ్విజయకాంక్షల వాదము లేల భారతీ! ౧౧

ప్రౌఢరాయలంతటివాఁడు పరమభక్తి
గౌరవము లంగరత్పఁగా ఘనతఁ బెంచి
నట్టిడిండిమభట్టసింహమును నేఁడు
నీదుదయ లేక యోడింప నేర్తు నమ్మ? ౧౨

గడచిన దింతగా వయసు, కాంచితిఁ బేరుఁ బ్రతిష్ఠ కొంత, దుం
దుడుకులు కొన్ని దాఁటితి, వినూతనసత్కవితాపథమ్ములం
దడుగులు వెట్టియుంటి, రుచిరార్థమనోహరకావ్యగుచ్ఛముల్
ముడిచితి నీదుకొప్పునను ముం దెటు నా భవితవ్య మున్నదో? ౧౩

కొమ్ములేనుంగులఁ గెంటుకొనుచుఁ బోవు
కవులు విబుధులు నైమర్శికప్రవరులు
రసికు లెంద ఱుందురో మహారాజసభను
అండగా నుండ కీవు జయాశ గలదె? ౧౪

ఆవులించినఁ బ్రేవు లల్ల లెక్కించు క
ర్కశతర్కవాదవిక్రమము కొంత
తిమ్మని బ్రహ్మఁగాఁ దీర్చిదిద్దఁగలట్టి
శబ్దశాస్త్రార్థసౌష్ఠవము కొంత
విన్నన్న యన్నదే వేద మన్నటు చెల్లు
షడ్దర్శనమహాప్రశస్తి కొంత
ఆడిన దాటగా నలవరింపఁగఁ జాలు
కైతలోఁ జాకచక్యంబు కొంత
ఎదిరిఁ గ్రక్కదలించు వాదీభసింహ
తాపటిష్ఠత యొకకొంత తనరఁ జేసి
యింతదనుక శ్రీనాథుని కెదురు లేక
యలరఁ జేసితి వమ్మ యో యజనికొమ్మ! ౧౫

అనుచుఁ దిగ్గన లేచు, నాల్గడుగు లల్లంతఁ బడిఁ వేయు, మె ల్లనఁ జేవెల్గునఁ గాంచు వీథిదెస, నేలా యింతయాలస్య మం చును బల్యంకికకై మహాతురతఁ గాంచుఁ, బ్రౌఢరాయక్షితీ శుని కాశీస్సులు వల్కు, డిండిముని మెచ్చుఁ, గెల్పు నాదే యనుఁ.

శస్త్రశస్త్రిని దేలిపోవు బ్రదుకో చావో మహాస్థానిలో
శాస్త్రక్రమబద్ధవాగ్రణములో సాగంగఁ బో దట్లుగా
నిస్త్రిగుణ్యుల కేని వాదభయముల్ నెక్కొల్పవె గ ల్పోటముల్
శాస్త్రి వాదభయ మ్మటన్ననుడి వాచారూఢి గాకుండునే? ౧౬

నావలె నతఁడు నానా దేశసంచార
సమ్యగుపాత్తవిజ్ఞానఘనుఁడు
నావలె నతఁడు నానామహారాజసం
స్థానవిఖ్యాతవిశాలయశుఁడు
నావలె నతఁడు నానాశాస్త్రపాండిత్య
శౌండిమాక్రాంతదిగ్జయయుతుండు
నావలె నతఁడు నానామహాకావ్యని
ర్మాణచాతుర్యవిభ్రాజితుండు
నేను బ్రాహ్మీకటాక్షమానితతముండ
నతఁడు శంభుప్రసాదమానితతరుండు
చెలఁగి మాదగు విప్రతిషేధ మిప్పు
డెట్లు పరిణతి నందునో యెవరి కెఱుక. ౧౭

వారక సద్వివాహము వివాదమునుం దమతోడఁ దుల్యు లౌ వారల కందగించుఁ, దగువాఁ డలడిండిమపండితుండె నా కారయ నీ రణమ్మున జయమ్మును గొంటినయేని నిల్వవే యారవితారకమ్ముగ యశోంగనతాండవపాండితీప్రభల్. ౧౮

కుళ్లాయియును మహాకూర్పాస మందియు
నన్యదృష్టిని వాని నచటె విడుచు
రత్నాంబరము లంగరాగము లందియు
నొకవైపుగా వాని నుజ్జగించు
గండపెండెరమును గవిపట్ట మందియు
నొకమూల వాని న ట్లుంచివైచు
సింహలలాటముల్ చిఱుగంట లందియు
ముట్టి యువ్వానిఁ దా నట్టె యుంచుఁ
దమిని వాదోపయుక్తసద్గ్రంథవితతిఁ
దెఱచుచుం జూచుచును సుంత తెఱపి లేక
యేదొ గొణఁగుచు లోలోఁ దదేకదృష్టి
నాంధ్రనైషధకర్త పారాడుచుండు. ౨౦

పాతంజలము విప్పి పరికించు నొకచోట
నొకసారి శేఖరయుక్తు లరయు
శాంకరభాష్యచర్చల నెంచు నొకచోట
శ్రౌతసూత్రార్థవిస్తరము నరయు
వ్యుత్పత్తివాదము నొగిఁ జూచు నొకచోట
ఖండనఖాద్యవాక్కులన నరయుఁ
గావ్యప్రకాశముఁ గాంచు నొక్కొకచోట
దండిభామహవాదతతుల నరయు
నలకవిత్రయసత్ప్రయోగాలిఁ దడవి
యెత్తు పై నెత్తు లెన్నెన్నొ యెంచి యుంచు
సకలవిద్యాసనాథుఁ డస్ఖలితవృత్తి
నలరి డిండిము నోడింప నరుగువేళ, ౨౧

డిండిమభట్టు నోడించి రాయల మన్న
నల నంది యొకవెల్గు వెలుఁగు టెపుడో ?
వేవిధంబుల నాదువిజయమ్ము గూర్చి స
• భ్యులపొగడ్తల నందఁబోలు టెపుడో ?
ఖండనమండనక్రమ మెంచి హర్షించు
కవిపండితుల మెప్పు గాంచు టెపుడో ?
తలపరాజయమహాత్రపను భుగ్నశిరస్కుఁ
డగుడిండిముని గాంచి యలరు టెపుడో ?

బహుకవీంద్రవాగ్బంధనప్రతిభఁ దనరు
కంచుఢక్కను బగిలింపఁగలుగు టెపుడో ?
దిగ్విజయగర్వమునఁ దలఁ ద్రిప్పు టెపుడో ?
అంబ శారద నాకోర్కె లరయు టెపుడో ? ౨౧

పల్లకి వేగముఁ లోఁ దన
యుల్లంబును బల్లవింప నూఁగాడుచుఁ దా
నల్లలితభావములఁ గవి
తల్లజుఁ డుప్పొంగి యాశుధారలఁ గురిసెన్. ౨౩

అంచితసత్కవీశ్వరుఁడ నంచు సభాస్థలి కెక్కినంతలో
నెంచుదు రెన్నొరీతుల సహించుట కావలె, నాయ మింత యో
జించుచు వారిశంకలకుఁ జిత్తము రంజిల నుత్తరంబు క
ల్పించి వచింపఁగావలయు, లెక్కకురానివి త్రోయఁగావలెన్
మంచియుఁ జెడ్డ లేక మడిమాన్యము లన్నియు మున్గినట్లుగాఁ
గొంచక దూఱువారల రగుల్కొనఁ గోపము వంచఁగావలెన్
మించిన మించ నొప్పు, విరమించిన మించక యుండ నొప్పు, సా
రించిన యుక్తిబాణముల రేఁగుచు ఖండన సేయ నొప్పు, భీ

ష్క్రించిన మాన మూని కనమిన్ వినమిన్ బచరించి వాని సీ
డ్పించవలెన్ మహాత్ము లగుపెద్దలఁ బిన్నల గారవించి మ
న్నించవలెన్ నిరుక్తుల గణించి సయుక్తికవాదరీతిఁ జి
త్రించవలెన్ సభాసదులరీతుల నెప్పటికప్డు గాంచి గ
ర్జించవలెన్ సభాపతులశీర్షము లెల్లను నల్ల నల్ల నూఁ
గించవలెన్ సుహాస్యము లగించుచుఁ బొందిక నాడ నాడ న
వ్వించవలెన్ శరించుప్రతివీరునిగుండెల గాల మూచు నో
డించవలెన్ జనావళి వడిం గరతాళము లొక్కపెట్టు మ్రో
గించ జయాంకవాదము ముగింపఁగఁ జేయఁగదమ్మ భారతీ! ౨౮

పల్లకి నల్ల డిగ్గి, వలెవాటు సడల్చుచుఁ గాలిపావలున్
మెల్లఁగ టక్కుటక్కున ధ్వనింపఁగఁ, జే చిఱుగంట మ్రోయఁ దా
నల్లన పీఠిపై పదము లానుచు జంకెనవాడిచూపులే
తెల్లముగా సభాసదులరీతులు దిద్దఁ దలంచె నిట్లుగన్. ౨౯

ఇసుముం జల్లిన రాలకుండె సభ యెంతే నిర్వికల్పస్థితిన్
పసిచక్కంగఁ బసిండిగద్దియను నాస్థానించె తాఁ, డాకడన్
రసికాగ్రేసరు లెవ్వరో? యిటుగ వీరమ్మన్యు లెవ్వారలో?
ఖుసిబిరాఅన్ ననుఁ గాంతు రీడ నెవ రొక్కో? డిండిముం డెక్కడో?



# ఛందోదర్పణము - కొన్నివిశేషములు

శ్రీ భట్టాచార్య

(ఆంధ్రసారస్వతపరిషత్పత్రిక 45 సంపుటము 5వ సంచికలో ప్రక టించిన "మనవి" ని చూచితిమి. అది మనవిరూపముగా నున్న హెచ్చరికగా మాకు భాసించినది. ఏదైన మా కేల? దానికి సమా ధానము చెప్పవలసిన బాధ్యత మామీఁద పడినది. దీనిమీఁదకూడ మనవియో హెచ్చరికో వెలువడినతదుపరి మా సమాధానము తెలుపు కొందుము. ఇయ్యవి పండితపరిషల్లోకము శ్రద్ధగా సమీక్షించి యథా ర్థము తెలుపఁగోరుచున్నారము.)

సంధిగతప్రాసము :—

కం. ధృవముగ సంధిజనిత రూ
పవిశేషప్రాస మనఁగఁ బరగు ప కారం
బవిరళ వ కార మగు న
య్యవ దాఱవపా లెఱుఁగ వనఁగ ముకుందా!

సంధిగతప్రాస మనఁగా సంధివశముచే నేర్పడిన వర్ణము ప్రాస స్థానమున నున్నవానికి మైత్రిఁ గూర్చుట యని లక్షణమునం దనంతుఁడు చెప్పి ప కారమునకే ప్రత్యేకముగా లక్ష్యమును జూపినాఁడు. అందుచే కేవల మొక ప కారమునకుమాత్రమే చెల్లుననియు మిగిలినవానికి చెల్లదనియు నర్థ మగుచున్నది. కాని యట్లు చెప్పుట తగదు. అయ్యది యుపలక్షణముగా క చ ట త ప లకును చెల్లును. అనంతుఁ డీవిషయము చక్కఁగా వివరించియున్నాఁడు. చూడుఁడు

కం. ప్రథమాంతవిభక్తులపైఁ
గథితము లగు కచటతపలు గసడదవ లగుఁ

పృథివి నివి గజడదబ లగు
ప్రథమవుసున్న లగు నాంతపదములమీఁదఁ.

ఛందో. ప్ర. ఆ. ప. 61

"గసడదవాస్స్యుః ప్రథమా మాత్రాదాత్మాస్మదోర్వినై వేతే. సవికృతి శబ్దా త్పరత స్సాంస్కృతికా పరుషా. ద్రుతప్రకృతికాత్సరళా స్స్యుస్త ద్రుతం చ బిందుస్స్యాత్" అను చింతామణిసూత్రమును వివరించి యుదాహరణముగా

గీ. వాఁడు గనువాఁడు సేకొనువాఁడు డెక్కు-
లాడువాఁడు దపోనిధి వాఁడు వెద్ద
చిక్కఁ గరి మ్రొక్కఁ జెలి వాక్కఁ డక్కు వెట్టి
శౌరిఁ దలఁచె నీఁ బిలిచె నా సంధు లిట్లు.

ఛందో. ప్ర. ఆ. ప. 62

అని చెప్పియున్నాఁడు. లక్షణలక్ష్యములఁ బరికింతము. "ప్రథమాంత విభక్తులపైఁ గథితము లగు కచటతపలు గసడదవ లగుఁ" అను లక్షణమునకు వరుసగా లక్ష్యముల నిట్లిచ్చెను.

| | | |
|---|---|---|
| (క) | వాఁడు + కనువాఁడు | = వాఁడు గనువాఁడు |
| (చ) | వాఁడు + చేకొనువాఁడు | = వాఁడు సేకొనువాఁడు |
| (ట) | వాఁడు + టెక్కులాడువాఁడు | = వాఁడు డెక్కులాడువాఁడు |
| (త) | వాఁడు + తపోనిధి | = వాఁడు దపోనిధి |
| (ప) | వాఁడు + పెద్ద | = వాఁడు వెద్ద |

ఇందు 'వాఁడు దపోనిధి' అను నుదాహరణమును బరిశీలింతము. "న వికృతి శబ్దాత్పరత స్సాంస్కృతికానాం భవంతి గసడదవాః" అను చింతామణిసూత్రముచే తెలుఁగుశబ్దములకంటె పరములైన సంస్కృత శబ్దములకు గసడదవలు గలుగవు. కాని యనంతుఁడు 'వాఁడు దపోనిధి' అని తెలుఁగుమీఁది సంస్కృత పదమునకు గసడదవాదేశము సేసి

నాఁడు. ఇది చింతామణికి విరుద్ధముగా నున్నందున తప్పందుమా? అది పొరపాటు కాదు. పూర్వకవుల ప్రయోగము లట్టివి గలవు. లక్ష్యము లున్నపుడు లక్షణములు చెప్పకపోవుట లక్షణకర్తల పొర పాటు కాని యాలక్ష్యములు తప్పుకావుగదా! లక్షణముఁలబట్టి లక్ష్య ముల సృష్టించరుగదా. పూర్వకవి ప్రయోగము లున్నవికనుక నే యనంతుఁడు 'వాఁడు దపోనిధి' అని ప్రయోగించినాఁడు. శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులుగారు ప్రౌఢవ్యాకరణమునందు "కొన్నియెడలఁ దెలుఁగులమీఁది సాంస్కృతిక కతపలకు గదబలు గానంబడియెడి" అని సూత్రించి వీర ల్గోపించిన, ఇట్లు దపంబు, వేఁడణములు- అను ప్రయోగ ములు చూపించియున్నారు. ఇయ్యది యనంతునికి మిక్కిలి ప్రోద్బలకము.

ఇఁక ద్రుతాంతములమీఁది గజడదబలను బరిశీలింతము. అనం తామాత్యుఁడు "పృథివి నివి గ జ డ ద బ లగు ప్రథమపునున్న లగు నాంతపదములమీఁదన్" అని లక్షణము చెప్పి లక్ష్యముల నిట్లు వరుసగాఁ జూపించియున్నాఁడు.

(క) చిక్కెన్ + కరి = చిక్కెఁ గరి
(చ) మ్రొక్కెన్ + చెలి = మ్రొక్కెఁ జెలి
(ట) వాక్కున్ + టెక్కు = వాక్కుఁ డెక్కు
(త) శౌరిన్ + తలఁచె = శౌరిఁ దలఁచె
(ప) నిన్ + పిలిచె = నిన్ బిలిచె

దీనినిగూర్చి పండితులవిమర్శలఁ బరికింతము. "ద్రుతప్రకృతిక ములమీఁది పరుషములకు గజడదబలును జెప్పఁబడి యా గజడదబలకు ముందు సున్న కలుగునని చెప్పెను. అనఁగా ద్రుతము సున్నగాను మాఱుననుట. సున్నయనఁగా నరసున్నయు, నిండుసున్నయు రెండు గ్రాహ్యములే. లక్ష్యమున "చిక్కెఁ గరి మొదలు శౌరిఁ దలఁచె" అనువఱకు నరసున్నకు లక్ష్య మిచ్చినాఁడు. తదుపరి 'నిన్ బిలిచె'

అని ముద్రణప్రతిలో నున్నది. కాని యది 'సంబిలిచె' నై యుండ నోపు. ద్రుతమున కనంతుఁడు సున్న విధించినాఁడు. అరసున్నకుఁ 'జిక్కెఁ గరి' ఇత్యాదులు, నిండుసున్నకు 'సంబిలిచె' అనునదియు లక్ష్యముగా నిచ్చియుండు. 'సంబిలిచె' రూపసిద్ధి యగునని యనంతుఁడు 'భ్రమ' పడినాఁడు లేదా యొకయరసున్నకు లక్ష్య మిచ్చినవాఁడైన కావలె. 'సున్న' అనుదానిచే నరసున్నలు నిండుసున్నలు గ్రహించి నిండుసున్నకు 'సంబిలిచె' అను రూపము నుదాహరించినాఁ డనియు నయ్యది ప్రమాద మనియు మా యాశయము.

(సుభాషిణి. సం. 2 సంచిక 5.)

అని శ్రీ వఝమాని గోపాలకృష్ణయ్యగారు వ్రాసిరి. ఈ వ్రాత చూడఁగనే మాకు చాల విచారము కలిగినది. ఇంతయసందర్భపు వ్రాఁత లేల వెలువడుచున్నవా యని. శ్రీ గోపాలకృష్ణయ్యగారు చెప్పినది సరికాదు. వారు అనంతామాత్యుని లక్షణమును పూర్తిగాఁ దప్పర్థము సేసికొనిరి. అందుచే వికృతమయిన విమర్శ చేయఁబడినది. కాని "ప్రమాదో ధీమతామపి" అని అన్నారుగదా పెద్దలు. అనంతుఁడు చెప్పిన లక్షణమును బరికింపుఁడు. "పృథివి నివి గజడదబ లగు ప్రథమపుసున్న లగు నాంతపదములమీఁదఁ" ఇది లక్షణము. దీనియర్థ మేమన- నాంతపదములమీఁదఁ అనుదానికి 'ప్రథమపుసున్న లగు' అనునది విశేషణముగాఁ జెప్పవలయును గాని క్రియగాఁ జెప్ప కూడదు. 'సడదబ లగుఁ' అను దానిలోని 'అగుఁ' అనునది మాత్రము క్రియ. అందుచే "ప్రథమపుసున్న లగు నాంతపదములమీఁదఁ" అంటే యిట్లర్థము సెప్పికొనవలయును. సున్న లగుటకు యోగ్యమయిన నకారాంతపదములమీఁదఁ అనఁగా ద్రుతాంతము లయిన పదములమీఁద నని యర్థము చెప్పవలయును. ద్రుతాంతమయిన పదములమీఁది కచటతపలు గజడదబ లగునని యనంతుఁడు

చెప్పియున్నాఁడు. గోపాలకృష్ణయ్యగారు అనంతునిలక్షణమును అపార్థము సేసికొని ద్రుతప్రకృతికములమీఁది పరుషములకు గజడదబలును జెప్పి యా గజడదబలకు ముందు సున్న కలుగుననియు, సున్నయనఁగా నరసున్నయు, నెఱసున్నయు, రెండు కలుగుననియు, నరసున్నకు 'చిక్కఁగరి' మొదలైనరూపములు నెఱసున్నకు 'నింబిలిచె' అనునది యనంతుఁడు చెప్పెనని ఒక వికృతమైన వ్యాఖ్యానము సేసిరి. అనంతుఁ డిచ్చిన యుదాహరణమునందలి 'నిన్బిలిచె' అనుదానిలోని నకారమును బూర్ణబిందువుగాఁ జేసి నెఱకు 'నింబిలిచె' అనునది లక్ష్యముగా నిచ్చియుండు. 'నింబిలిచె' అని రూపసిద్ధి యగునని యనంతుఁడు 'భ్రమ' పడినాఁడు. అని గోపాలకృష్ణయ్యగారు వ్రాయుట పరమసాహసము. లక్షణమును సరిగా నర్థముచేసికొనక తప్పుగా నర్థము సేసికొని యనంతునికి లేనిపోనిభ్రమప్రమాదము లంటఁగట్టుటకుఁ బూనుకొనిరి. అనంతుఁడు సున్నలగుటకు యోగ్యమయిన నకారాంత పదములమీఁది పరుషములు గజడదబ లగునని చెప్పి యుదాహరణముగా నరసున్న లగుట కవకాశ మున్నతావుల నరసున్నరూపములఁ జూపించి అరసున్న గాని నెఱసున్న గాని యగుట కవకాశములేని 'నిన్' లోని నకారమును పొల్లునకారముగనే యుంచి 'నిన్బిలిచె' అని ప్రయోగించి చూపించినాఁడు. అంతియేకాని 'నింబిలిచె' అను లేనిరూపమును గల్పించి యనంతునికే భ్రమప్రమాదము లంటఁగట్టుట గర్హింపఁదగినది.

## 13. అచేతన ద్వితీయ

ఆ. వె. అ యచేతన ద్వితీయ దా నిజరూప
మయ్యు నుండు, ప్రథమ యట్లు లుండు
గ్రతువు కాచె దాశరథి కృష్ణుఁ డొకపర్వ
తమును గొడుగుభంగిఁ దాల్చె ననఁగ.

ఛందో. ప్ర. ఆ. ప. 63

"తస్యాః ప్రథమా చ జడపదానాం స్యాత్" 'జడపదంబు ద్వితీయకుఁ బ్రథమ బహుళంబుగా నగు' అను చింతామణి, బాలవ్యాకరణసూత్రముల యర్థముఁనే యనంతుఁడు పైపద్యమునందుఁ జెప్పి యున్నాఁడు. ఆ పద్యమునందలి మొదటి రెండుపాదములు లక్షణము. మూఁడు నాలుఁగుపాదములు లక్ష్యములు. "ఆ యచేతనద్వితీయ దా నిజరూప మయ్యు నుండు ప్రథమ యట్టులుండు" అనఁగా జడవాచకము లైన ద్వితీయావిభక్త్యంతపదములు స్వస్వరూపముతోను, ప్రథమాంతములవలెను నుండు నని భావము. ఇందుకు లక్ష్యములుగాఁ జూపిన వానిని బరిశీలింతము-

"క్రతువు కాచె" అనునది ద్వితీయాంతపదము ప్రథమమైనదానికిని, "పర్వతమును గొడుగుభంగి" అనునది స్వస్వరూపమునకు నుదాహరణములుగా నున్నవి. క్రతువు, పర్వతము అను రెండుపదములు అచేతనము లైనప్పటికి ఒకేపదమును దీసికొని ప్రథమకు ద్వితీయకు నుదాహరించిన బాగుండెడిది. "క్రతువు కాచె" అనునది తప్పనుకొని శ్రీ గోపాలకృష్ణయ్యగారు "క్రతువు గాచె" అని దిద్దుకొనమనిరి. ఎందుకట్లు దిద్దుకొనుట! పరుషమును సరళముగాఁ జేయవలసిన యవసరమేమి? "ప్రథమమీఁది పరుషములకు గసడదవలు బహుళంబుగా నగు" అనుటచే క్రతువు గాచె- క్రతువు కాచె- అని రెండురూపము లుండునుగదా! అనంతుఁడు అచేతనద్వితీయకుఁ బ్రథమ వికల్పముగా వచ్చునని చూపించుటకే యా రూపమును నిచ్చియుండును. అంతియేకాని గసడదవాదేశవిషయమును జెప్పుటకుఁ గాదు కదా!

ఛందోదర్పణము ప్రథమముద్రణమునందు "క్రతువుఁ గాచె" అని యున్నదికాఁబోలు. దానినిగూర్చి శ్రీ రావూరి దొరస్వామిశర్మగారు "జడంబు ద్వితీయకుఁ బ్రథమ విభాష నగుటయే దీని యర్థము. 'క్రతువు' ప్రథమకు నుదాహరణ మగుటయుఁ గ్రతువుపై నర్థబిందు

వుంట దోషము" అని వ్రాసిరి. ఇయ్యది సరియే కావచ్చును. కాని లక్షణమునుబట్టి- అనఁగా లక్షణ మున్నక్రమమునుబట్టి- లక్ష్యము నుండుట యుక్త మని తోఁచెడిని. అనఁగా మొదటి యుదాహరణము ద్వితీయకు, రెండవయుదాహరణము ప్రథమకు నుండిన లెస్సగా నుండును. అనంతుని లక్ష్యమునందున్న "క్రతువుఁ గాచె" అనునది ద్వితీయకును, 'పర్వతమును' అని ముద్రణమునం దున్నది- అది 'పర్వతంబు' అని సవరించి "పర్వతంబు గొడుగుభంగి" అని ప్రథమకు నుదాహరణముల నిచ్చిన లక్షణమునందలి క్రమము ననుసరించి లక్ష్యము లుండఁగల వని మా యూహయును. ఆ పద్య మిట్లుండఁదగును-

ఆ. వె. ఆ యచేతనద్వితీయ దా నిజరూప
మయ్యు నుండు, ప్రథమ యట్లు లుండుఁ
గ్రతువుఁ గాచె దాశరథి, కృష్ణుఁ డొకపర్వ
తంబు గొడుగుభంగిఁ దాల్చె ననఁగ.

## 14. ద్విత్వము

గీ. ద్విత్వమున కాదివర్ణంబు తెలుఁగునందు
నూఁదకుండును వలసిన నూఁదియుండు
జానకీవల్లభుఁడు క్షమాశాలి యనఁగ
దశరథాత్మజుఁడు స్వామి ధాత్రికనఁగ.

ఛందో. ప్ర. ఆ. ప. 67

అనంతుఁడు లక్షణమునందు ద్విత్వ మని చెప్పి లక్ష్యమునందు కకారషకారములు కూడిన సంయుక్తాక్షరము నిచ్చియున్నాఁడు. రెండవయుదాహరణము నట్టిదే. ద్విత్వ మనఁగా సజాతియక్షరముల కూడికను ద్విత్వ మనియు, విజాతియక్షరముల కూడికను సంయుక్తాక్షర మనియు చెప్పుదురు. అనంతుఁడు ద్విత్వ మని చెప్పి సంయుక్తాక్షరమును ఇచ్చియుండుటచే విజాతియక్షరముల కూడికయు ద్విత్వ మని యనంతుని యభిప్రాయ మైయుండనోపు.

సిద్ధాంతకౌముదికారుఁడు పాణిని "తోర్లి" అని చెప్పి తల్లీల, తల్లక్షణము అని నిత్యముగా తకారమునకు లకారము చెప్పియుండ నవంతుఁడు తద్భిన్నముగాఁ దనఛందోదర్పణమునందు-

"లలిని దద్వ్యంజనంబుపై లత్వమునకు
ద్విగతి తల్లీల యనఁగఁ దల్లీల యనఁగ"

అని వికల్పముగాఁ జెప్పినాఁడు. పాణిని చెప్పిన నిత్యవిధానమును అనంతుఁడు వికల్పముగాఁ జెప్పుట విశేషము కదా! అట్లే యనంతునిమతమున ద్విత్వ మన విజాతియక్షరముల కూడికయు నగు నని తోఁచెడిని,

ఇక నూఁదుడువిషయమును బరికింతము. దీనినిగూర్చి వైయాకరణులు చెప్పిన దేమి? "సంయుక్తే సంస్కృతాద్యే స్యాత్సర్వ మాంధ్రపదం లఘు, భవే దాద్యసమాసేపి రేఫయోగాత్పదం తథా, నపదేపి తథాత్వం స్యాత్క్వాచి న్నైవ నరేఫయో" అని వికృతివివేకము. "సంయుక్తే సంస్కృతాద్యే స్యాత్సర్వ మాంధ్రపదం లఘు" సంస్కృతపదసంయుక్తాక్షరము పరముగా నుండఁగా నాంధ్రపదాంత్యవర్ణము లఘు వగును. 'రావణుని ద్రోహి' ఇందు సంస్కృతపదసంయుక్తాక్షరము పరముగానున్నను పూర్వపదమునందలి ని వర్ణము గురువు కాలేదు. "భవే దాద్యసమాసేపి రేఫయోగాత్పదం తథా" సంస్కృతసమాసమునందుఁగూడ నొకానొకచో రేఫసంయోగవర్ణము పరముగా నుండ పూర్వాక్షరము గురువు కాదు. లఘువే యగును. "శతతాళదఘ్నహ్రదంబునం బడియె" సంస్కృతసమాసమందు రేఫతోఁగూడిన సంయుక్తాక్షరము 'హ్ర' పరముగా నున్నను 'ఘ్న' గురువు కాలేదు. "న పదేపి తథా త్వస్యాత్" సమాసమందుకాక యేకపదమందుగూఁడ లఘు వగుచున్నది. 'అద్రువ' చిద్రుపలు, విద్రిచెను మొదలైనవి. (సశేషము)

### మహాకవి కాళిదాసవిరచిత మగు

# శృంగారతిలకము

శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి.

## హరిహరదేవస్తుతి

మ. ఉరకే లేఖిని గేలఁ బూని యెనో యేదో వ్రాయుచున్నట్టు లం
దఱకుం దోఁపఁగఁ జేయుచుండుటయె మత్కార్యంబు ; కావ్యంబు సుం
దరలీలన్ రచించి తత్కృతికిఁ గర్త న్నన్నుఁ గావించు టే
చిరకాలాభ్యసనంబు నీ ; కెఱుఁగవా శ్రీ మాధవో మాధవా !

## బ్రాహ్మీదేవతాస్తవము

మ. అవురా! "యమ్మయుఁ బెట్టఁబోదడుగకే" యంచాడుమాటల్ చెవిన్
గవియన్ వేఁడెదఁ గాని నీ వెఱుఁగవా కావ్యంబు ముంపన్ సుధన్
భవదీయాత్మభవుండె కా కితరుఁడా ? బ్రాహ్మీమహాదేవతా !
కవిమూర్ధన్యుఁడు ; బ్రహ్మవంశజననఖ్యాతిం బురాయించుటన్.

## స్వకీయము

మ. సురభాషం గవికాళిదాసకృత మౌచున్ ధీరశృంగారభా
సుర మౌచున్ రసికప్రమోదకర మౌచున్ మించుకావ్యంబుఁ గా
కరపర్త్యన్వయకృష్ణశాస్త్రి తెనుఁగుం గావించు మోచాఫలో
దరసారాకరవాగ్రమామధురిమాధారైకధారాధురన్.

---

శ్లో॥ బాహూద్వౌ చ మృణాల మాస్యకమలం లావణ్యలీలాజలమ్
శ్రోణీతీర్థశిలా చ నేత్రశఫరం ధమ్మిల్లశైవాలకమ్
కాంతాయా స్స్తనచక్రవాకయుగలం కందర్పబాణానలై
ర్దగ్ధానా మవగాహనాయ విధినా రమ్యం సరో నిర్మితమ్॥

మ. రమణీరమ్యసరోవరంబు నిల నిర్మాణించె బాహామృణా
లము నాస్యాంబుజముం దృగాళిశఫరముం లావణ్యనీరం బురో
జమనోహారిరథాంగముం గబరికాశైవాలముం శ్రోణితీ
ర్థమహాశ్మంబు విధాత మారశరసంతప్తావగాహార్థ మై. ౧

శ్లో॥ ఆయాతా మధుయామినీ యది పునర్నాయాత ఏవ ప్రభుః
ప్రాణా యాంతు విభావసౌ యది పునర్జన్మగ్రహం ప్రార్థయే
వ్యాధః కోకిలబంధనే హిమకరధ్వంసే చ రాహుగ్రహః
కందర్పే హరనేత్రదీధితి రహం ప్రాణేశ్వరే మన్మథః॥

మ. అయుదెంచెన్ మధుమాసయామిని; విభుండా యింతకున్ రాఁడు; దు
ర్భర మీజీవిత మగ్గి మ్రగ్గియుఁ బునర్జన్మం బపేక్షించెదన్
హరఫాలానల మై మనోజు; మదనుం డై నామనోనాథుఁ; జెం
దురు రాహుగ్రహ మై; పికావళిని వ్యాధుం డై విశసించెదన్. ౨

శ్లో॥ ఇందీవరేణ నయనం ముఖ మంబుజేన
కుందేన దంత మధరం నవపల్లవేన
అంగాని చంపకదళై స్స విధాయ వేధాః
కాంతే! కథం ఘటితవా నుపలేన చేతః॥

ఆ. వె. కనులఁ గలువచేతఁ, గాయమ్ము సంపఁగి
చేత, మోవిఁ జివురుచేత, మోముఁ
దమ్మిచేత, రదనతతి మల్లెచేఁ జేసి
ధాత నాఁతిమనసు ఱాతఁ జేసె. ౩

శ్లో॥ ఏకో హి ఖంజనవరో నళినీదళస్థో
దృష్టః కరోతి చతురంగబలాధిపత్యమ్
కిం వా కరిష్యతి భవద్వదనారవిందే
జానామి నో నయనఖంజనయుగ్మ మేతత్॥

తే. గీ. అమరునంట! చతురంగబలాధిపత్య
మబ్జమున ఖంజరీట మొందరయునెడల
అక్షిఖంజనయుగళి నీముఖాననాబ్జ
మందుఁ గనఁగ నిఁ కేమి సంప్రాప్త మగునో! ౪

శ్లో॥ యే యే ఖంజన మేక మేవ కమలే పశ్యంతి దైవాత్ క్వచి
త్తే సర్వే కవయో భవంతి నితరాం ప్రఖ్యాతభూమీభుజః
త్వద్వక్త్రాంబుజనేత్రఖంజనయుగం పశ్యంతి యే యే జనా
స్తే తే మన్మథబాణజాలవికలా ముగ్ధే! కి మత్యద్భుతమ్॥

ఉ. దైవవశంబునన్ వికచతామరసంబున నొక్కఖంజనం
బే వసియించుటం గనఁ గవీంద్రులు ఖ్యాతమహీంద్రు లౌదు రే!
నీవదనాంబుజాతమున నేత్రయుగీవరఖంజనద్వయం
బేవఁడు కాంచినన్ బడలు నేటి కనంగశరానువిద్ధుఁ డై? ౫

శ్లో॥ ఝటితి ప్రవిశ గేహం మా బహి స్తిష్ఠ బాలే!
గ్రహణసమయవేళా వర్తతే శీతరశ్మేః
త దిహ విమలకాంతిం వీక్ష్య నూనం స రాహుః
గ్రసతి తవ ముఖేందుం పూర్ణచంద్రం విహాయ॥

చ. కలువలతేని యీగ్రహణకాలమునన్ బయటం జరింప కో
చిలుకకొల్కి! గర్భగృహసీమకు వైళమ పొమ్ము; పోనిచోఁ
గలకలలాడు నీ నెఱిజేగా మొగముం దిలకించి నిండుజా
బిలి నెడఁబాసి రాహు వతివేలరతిం గబళింప వచ్చెడిన్. ౬

శ్లో॥ కస్తూరీవరపత్రభంగనికరో మృష్టో న గండస్థలే
నో లుప్తం సఖి! చందనం స్తనతటే ధౌతం న నేత్రాంజనమ్
రాగో న స్ఖలిత స్తవాధరపుటే తాంబూలసంవర్ధితః
కిం రుష్టాసి? గజేంద్రమందగమనే! కిం వా శిశు స్తే పతిః?

చ. చెఱుగవు తళ్కుఁజెక్కుల రచించినకస్తురిపత్త్రభంగముల్ ;
కరఁగదు వాలుఁగన్నుఁగవఁ గాటుక ; చందనచర్చ చన్నులన్
తొలఁగదు ; కావి మోవిపయిఁ దార్కొనుతమ్మరసంపుకెంపు పెం
పఱుగదు, కామినీ ! కుపితవా ? పతి యర్భకుఁడా ? వచింపవే. ౭

శ్లో॥ సమాయాతే కాంతే కథమపి చ కాలేన బహునా
కథాభి ర్దేశానాం సఖి ! రజని రర్ధం గతవతీ
తతో యావల్లీలాకలహకుపితాస్మి ప్రియతమే
సపత్నీవ ప్రాచీది గియ మభవ త్తావ దరుణా॥

మ. అరుదెంచెన్ బతి యింతకాలమున ; కాయాదేశవార్తాళితో
నరిగెన్ సాము త్రియామ ; నా ప్రణయకోపావేశ మాపైని మే
దుర మయ్యెన్ బ్రియుపై ; నిఁకేమి వచియింతున్నెచ్చెలీ! యింతలోఁ
గర మేపారెను బ్రాచి నాసవతి నాఁగా రాగభోగాకృతిన్. ౮

శ్లో॥ శ్లాఘ్యం నీరసకాష్ఠతాడనశతం శ్లాఘ్యః ప్రచండాతపః
క్లేశ శ్లాఘ్యతర స్సుపంకనిచయైః శ్లాఘ్యోఽతిదాహోనలః
యత్కాంతాకుచపార్శ్వబాహులతికా హిల్లోలలీలాసుఖమ్
లబ్ధం కుంభవర ! త్వయా నహి సుఖం దుఃఖై ర్వినా లభ్యతే॥

చ. తలఁకుట శుష్కదారుపటుతాడనసంగతి, నాతపార్తి చే
గలఁగుట, పంకసంకలన గ్రాలుట; నగ్నిఁ దపించియుంట స
త్ఫలితము గల్గె నింతికుచపార్శ్వశుభస్థితి కౌఁగిలింతలన్
గలుగునె సౌఖ్యముల్ మివులఁ గష్టము లందక కుంభరాజమా ! ౯

శ్లో॥ కిం కిం వక్త్ర ముపేత్య చుంబసి బలా న్నిర్లజ్జ ! లజ్జా క్వ తే
వస్త్రాంతం శఠ ! ముంచ ముంచ శపథైః కిం ధూర్త వాగ్బంధనైః
ఖిన్నాహం తవ రాత్రిజాగరవశా త్తా మేవ యాహి ప్రియామ్
నిర్మాల్యోజ్ఝితపుష్పదామనికరే కా షట్పదానాం రతిః॥

మ. విడరా పయ్యెదకొంగు ; సిగ్గుఁ గనఁబోవే! బల్మిమై మోము ము
ద్దిడుచున్నాఁడవు ; చాల్ వృథాశపథవాగ్వ్యాప్తుల్ ; నిశాజాగృతిన్
బడలేన్ నేను ; భవత్ప్రియాంతికమె సంభావింపు ; మేలా ముదం
పడు నిర్మాల్యవిసృష్టమాలికల సంపర్కంబునన్ దుమ్మెదల్. ౧౦

శ్లో॥ వాణిజ్యేన గత స్సమే గృహపతి ర్వార్తాపి న శ్రూయతే
ప్రాత స్తజ్జననీ ప్రసూతతనయా జామాతృగేహం గతా
బాలాహం నవయౌవనా నిశి కథం స్థాతవ్య మస్మ ద్గృహే
సాయం సంప్రతి వర్తతే పథిక! హే స్థానాంతరం గమ్యతామ్॥

మ. చనె వాణిజ్యముపొంటెఁ; బంపఁడు సమాచారంబు మాయింటియా
యన ; తన్మాతయుఁ బుత్రికిం బురుఁడు వోయం బోయె రేపాడి య
ల్లునియింటన్ ; నవయౌవనన్, తగునె యీలోనన్ వసింప న్నిశిన్
చను మోయీ పథికా! మఱొండుకడకున్ సాయంతనం బయ్యెడిన్.

శ్లో॥ యామి న్యేషా గహనజలదై ర్బద్ధభీమాంధకారా
నిద్రాయాంతో గృహపతి రసౌ క్లేశితః కర్మదుఃఖై
బాలా చాహం మనసిజభయాత్ ప్రాప్తగాఢప్రకంపా
గ్రామ శ్చోరై రయ ముపహతః పాంథ! నిద్రాం జహీహి॥

మ. పవ లెల్లన్ బని చేసి చేసి యెవులన్ బద్ధశ్రముం డౌచు నా
ధవుఁడా నిద్దురవోయినాఁడు ; సవమోదం బై తమోభీమ మై
తవు నీయామిని ; చోరభీతి గల దేతద్గ్రామసీమన్ ; మనో
భవభీతిన్ బొడమెన్ వడంకు; విడలేవా? పాంథ! నిద్రాణతన్. ౧౨

శ్లో॥ ఇయం వ్యాధాయతే బాలా
భ్రూ రస్యాః కార్ముకాయతే
కటాక్షా శ్చ శరాయన్తే
మనో మే హరిణాయతే॥

తే. గీ. కలికిచూపులు తూఁపులు, కన్నుబొమలు
చండకోదండయుగళంబు, చంద్రవదన
ప్రాణహరణప్రవీణకిరాతి, మామ
కాంతరంగం బమాయికహరిణకంబు. ౧౩

శ్లో॥ క్వభ్రాంత శ్చలితోఽసి వైద్యకగృహం కిం తత్ర శాంతీ రుజామ్
కిం తే నాస్తి గృహే సఖే! ప్రియతమా సర్వాన్ గదాన్ హంతి యా
వాతశ్చ త్కుచకుంభమర్దనవశా త్పిత్తం చ వక్త్రామృతాత్
శ్లేష్మాణం వినిహంతి హంత ! సురతవ్యాపారకేళిశ్రమాత్॥

ఉ. ఆతురతన్ గమింతు వెట ? కామయశాంతికి వెజ్జ నింటి; కీ
యాతన లేల ? రోగనివహాపహ నీప్రియ లేదె యింటిలో
వాత మురోజమర్దనతఁ బైత్యము తీయనిమోవి నాన, సం
జాతకఫంబు పైసరము సల్పుటచేత శమింపకుండు నే ! ౧౪

శ్లో॥ దృష్టిం దేహి పున ర్బాలే !
కమలాయతిలోచనే !
శ్రూయతే హి పురా లోకే
విషస్య విష మౌషధమ్॥

తే. గీ. బాల ! జలజవిశాలవిలోలనయన !
పఱపు మఱియొక్కసారి నావైపు చూపు
"విషమునకు నౌషధం బగు విష" మటంచు
వినవె లోకమ్ములోఁ బురాతనఁపుమాట. ౧౫

శ్లో॥ అంతర్గతా మదనవహ్నిశిఖావలీ యా
సా బాధతే కి మిహ చందనచర్చితేన
యః కుంభకారపవనోపరిపంకలేప
స్తాపాయ కేవల మసౌ న చ తాపశాన్త్యై॥

మ. అపురా! యాంతరమారఘోరశరవారాగ్నిచ్ఛటాధాటి తా
నివతాళించు పటీరపంకములచే నింతేని శాంతించునే?
నవపంకమ్ములు కుంభకారపవనవ్యస్తంబు లెంతేనిఁ దా
పవిశేషోదయహేతుభూతములు, మాపంజాలునే తాపమున్. ౧౬

శ్లో॥ దృష్ట్వా యాసాం నయనసుషమాం వంగవారాంగనానామ్
దేశత్యాగః పరమకృతిభిః కృష్ణసారై రకారి
తాసా మేవ స్తనయుగజితాః కుంభిన స్సంతి మత్తాః
ప్రాయో మూర్ఖః పరిభవవిధౌ నాభిమానం తనోతి॥

చ. సుకృతులు కృష్ణసారములు సుందరవంగవిలాసినీమణీ
నికరదృశావిలాసము గణించి గమించెఁ ద్యజించి దేశ; మా
సకియల మేల్గరాళివలిచన్నుల కోడియుఁ బాయఁబోవు మ
త్తకరినికాయముల్; కనఁడు తా నభిమానము మూర్ఖుఁ డెన్నఁడున్.

శ్లో॥ అపూర్వో దృశ్యతే వహ్నిః కామిన్యాః స్తనమండలే
దూరతో దహతే గాత్రం హృది లగ్న స్తు శీతలః॥

ఆ. వె. కామినీమనోజ్ఞకఠినస్తనంబులం
బొలుచుఁ జిత్ర మగు నపూర్వవహ్ని,
అది సుదూరమందు నంగమ్మును దహించు
నిచ్చుఁ జల్లదనము నెదఁ గదింప. ౧౮

శ్లో॥ కథ మేత త్కుచద్వంద్వమ్ పతితం తవ సుందరి!
పశ్యాధఃఖననా న్మూఢ! పతంతి గిరయోఽపి చ॥

తే. గీ. సుందరీ! నీ ఘనస్తనచ్యుతికి మూల
కారణం బేమె? యోయి యజ్ఞానధనుఁడ!
యనయ మెనయ నధస్స్థలీఖననకలన
నొఱఁగకున్నె మహాధరాధరము లైన. ౧౯

శ్లో॥ కుసుమే కుసుమోత్పత్తిః శ్రూయతే న తు దృశ్యతే
బాలే! తవ ముఖాంభోజే దృష్ట మిందీవరద్వయమ్॥

ఆ. వె. పూవులోనఁ బూవు పుట్టు నంచు జగాన
వినఁగలేదు దానిఁ గనఁగలేదు
ముగుద! నీదు ముద్దుమోముఁదామరయందుఁ
గాన నయ్యె నల్లకలువజంట. ౨౦

శ్లో॥ అయి మన్మథచూతమంజరి! శ్రవణాయతచారులోచనే!
అపహృత్య మనః క్వయాసి త త్కి మరాజక మత్ర రాజతే॥

తే. గీ. శ్రవణయుగళాయతవిలోలచారునయన!
మారసహకారమంజరీ! మామకీన
మానసము దొంగిలించి పోఁ బూనె దెటకు?
ప్రబలియున్న దె యింత యరాజకమ్ము! ౨౧

శ్లో॥ కోప స్త్వయా హృది కృతో యది పంకజాక్షి!
సోఽస్తు ప్రియ స్తవ కి మత్ర విధేయ మన్యత్
ఆశ్లేష మర్పయ మదర్పితపూర్వ ముచ్చై
ర్దంతక్షతం మమ సమర్పయ చుంబనం చ॥

చ. వనజదళాయతేక్షణ! యవారిగ నెమ్మదిఁ గోప మందితే!
యనయము నీకు నయ్యది ప్రియం బగుఁగాక యిఁ కేమి సేయుదుఁగా
మునుపు మదర్పితంబు లగు ముద్దులఁ గ్రమ్మరఁ గ్రుమ్మరింపవే
ఘనరదనక్షతంబులను గౌఁగిళులన్ దరిసింపవే యిఁకన్. ౨౨

ఇది కవికంఠీరవ కవిమూర్ధన్య విద్వత్కవివర ప్రౌఢకవిచంద్ర బిరుదాంకిత
కాకరపర్తి కృష్ణశాస్త్రి విరచిత శృంగారతిలకాంధ్రీకృతి
సంపూర్ణము.



# ప్రాచీనాంధ్ర చారిత్రకభూగోళము - నాడులు

శ్రీ కుందూరి ఈశ్వరదత్తు.

## పా క నా డు

పాకనాటిని బ్రశంసించిన బ్రథమాంధ్రకవి కవిరాజశిఖామణి నన్నిచోడుఁడు. ఇతఁడు తన కుమారసంభవకావ్యమునఁ బాకనాటి యిరువదియొక్క వేయిటిని గూర్చి యావిధముగఁ దెల్పియున్నాఁడు.

చ. అరివరపాలమౌళి దళితాంఘ్రియుగుండయి పాకనాటియం
దిరువదియొక్క వేయిటి కధీశుఁడునాఁ జను చోడబల్లికిం
జిరతరకీర్తి కగ్రమహిషీతిలకంబన హైహయాన్వయాం
బరశశిరేఖయైన గుణభాసిని శ్రీసతికిం దనూజుఁడన్.

ఎఱ్ఱాప్రెగ్గడ రచించిన భారతారణ్యపర్వాంతమందలి యీక్రింది పద్యమునందుఁ దాను పాకనాటిలోని గుడ్లూరువాసి యైనట్లు వ్రాసి కొనెను.

సీ. భవ్యచారిత్రుఁ డాపస్తంబసూత్రుండు
శ్రీవత్సగోత్రుండు శివపదాబ్జ
సంతతధ్యానసంసక్తచిత్తుఁడు సూర
నార్యునకును బోతమాంబికకును
నందనుం డిలఁ బాకనాటిలో నీలకం
ఠేశ్వరస్థానమై యెసక మెసఁగు
గుడ్లూరి నెలవున గుణగరిష్ఠతనొప్పు
ధన్యుఁ డద్వైతైకతత్పరాత్ముఁ
గీ. డెఱ్ఱనార్యుండు సకలకవీంద్రవినుతుఁ
డైననన్నయభట్ట మహాకవీంద్రు

సరససారస్వతాంశప్రశస్తి తన్నుఁ
జెందుటయు సాధుహర్షణసిద్ధిఁ గోరి.

మంచెన కేయూరబాహుచరిత్రమునందు రాజేంద్రచోడుని మంత్రియైన కొమ్మనామాత్యుని వర్ణించుచు

మ. అరుదందఁగ వెలనాటిచోడమనుజేంద్రాజ్ఞాపనం బూని దు
స్తరశక్తిం జని యేకవింశతిసహస్రగ్రామసంఖ్యాకమై
ధరణిం బేర్చిన పాకనాడు నిజదోర్దండైక లగ్నంబుగాఁ
బరిపాలించె నమాత్యకొమ్మన జగత్ప్రఖ్యాతచారిత్రుఁడై.

అని రాజేంద్రచోడుఁడను నామాంతరముగల వెలనాటి చోడమహారాజుయొక్క యాజ్ఞానుసారముగా నిరువదియొక్క వేల గ్రామములు గల పాకనాటిని మంత్రికొమ్మన పరిపాలించినట్లు చెప్పెను. అదియుఁ గాక ఈకొమ్మన మహాశౌర్యవంతుఁడై సామంతుల నెందఱినో క్రొత్త చెర్ల పరిసరప్రాంతముల యుద్ధమునందు భంగించినట్లు ఈక్రిందిపద్యములవలనఁ దెలియవచ్చుచున్నది.

క. చలము మెయిఁ గటకసామం
తులు కరి హయ బహుళసేనతో నేతేఁరఁగా
దలపడియెఁ గొమ్మసచివుఁడు
బలియుండై క్రొత్తచెర్ల పరిసరభూమిన్.

ఈక్రొత్తచెర్లయే కొచ్చెర్లకోటయను నెల్లూరిజిల్లాలోని దర్శితాలూకా కొచ్చెర్లకోట గ్రామము.

శ్రీనాథకవి రచించిన భీమేశ్వరపురాణములో నీ కవిసార్వభౌముఁడు పాకనాటివాఁడైనట్లు చెప్పుకొన్నాఁడు.

సీ. వినిపించినాఁడవు వేమభూపాలున
కఖిలపురాణవిద్యాగమములు

కల్పించినాఁడవు గాఢపాకంబైన
హర్ష నైషధకావ్య మాంధ్రభాష
భాషించినాఁడవు బహుదేశబుధులతో
విద్యాపరీక్షణవేళలందు
వెదచల్లినాఁడవు విశదకీర్తిస్ఫూర్తి
కర్పూరములు దిశాంగణములందుఁ

గీ. పాకనాటింటివాఁడవు బాంధవుఁడవు
కమలనాభుని మనుమఁడ వమలమతివి
నాకుఁ గృపసేయు మొక ప్రబంధంబు నీవు
కలితగుణగణ్య శ్రీనాథకవివరేణ్య.

నెల్లూరుజిల్లా, నెల్లూరు తాలూకాలోని కొన్ని తమిళ శాసనములందు నియ్యది పాక్కైనాడనియు, జయంకొండ చోళమండలములో నంతర్భాగమనియుఁ జేర్కొనఁబడినది. ఈ పాక్కైనాడులోని 'పాక్కై' పదము పూగశబ్దభవమనియుఁ, బూంగినాడను నొకవిషయము (country) శ్రీశైలపూర్వపాదనికటమునుండి, గుండ్లకమ్మయుభయతటములను జేరి తూర్పుసముద్రమువఱకు వ్యాపించియుండెననియు, శ్రీ రామయ్యపంతులుగారు కొండపేటి రెడ్లశాసనములఁ బ్రకటించుచుఁ దమ యభిప్రాయమును దెలిపియుండిరి. కాని యీ యభిప్రాయముతో నేకీభవింపక శాసనసంపుటసంపాదకులగు శ్రీ కృష్ణశాస్త్రిగారు, పాకనాడులోని యంతర్భాగమె పూంగినాడనియు పాక, పూంగి, పూగశబ్దభవములేయైనను పాకనాటిలోని ఉత్తరభాగము పూంగినాఁడనియుఁ, బూంగినాటినిబట్టియే పాకనాటికిఁ బేరువచ్చియుండుననియు వారి ప్రత్యేకాభిప్రాయమును వెలిబుచ్చిరి. కాని పాకనాడు వేఱు, పూంగినాడు వేఱు. రెండును వేర్వేఱునాడులనియు నొకదానిలో నంతర్భాగము రెండవది కాదనియు నాయభిప్రాయము. (ద)

(ద) ఎపిగ్రాఫియా ఇండికా, సంపుటము 11. పుట 316.

వేమారెడ్డి మద్రాసుమ్యూజియమ్ తామ్రశాసనములోఁ బాంగినా డీవిధమున వివరింపఁబడినది. (ద)

"ఆస్తే శ్రీగిరిపూర్వపాదనికటా పూర్వపాథోనిధే ర్దేశః
కుండితరంగిణీ ముభయతః శ్రీ పూంగినామాంకితః॥

విజయనగర రాజప్రతినిధియైన రెండవసంగముని బిట్రగుంట శాసనమున పాకనా డిట్లు వర్ణింపఁబడినది. (బ)

పాకస్యోవిషయోస్త్యపార మహిమా ప్రాచఃపయోధిస్తటే
తస్మిన్ విక్రమసింహ మిత్యపిపురం ధత్తేలలామశ్రియం॥

గుంటూరుజిల్లాలోని ఒంగోలు; నెల్లూరుజిల్లాలోని రాపూరు, వెంకటగిరి, ఆత్మకూరు, కావలి, ఉదయగిరి, కందుకూరు తాలూకాల లోని గ్రామములలోఁగల శాసనములం దాయాగ్రామములు పాక నాటిలోఁ జేరియున్నట్లు వెల్లడియగు చున్నది.

పై నుదాహరింపఁబడిన శాసనములో విక్రమసింహపురము పాకనాటిపురములలో శ్రేష్ఠమైనదని వ్రాయఁబడియున్నది గదా, బిట్రగుంట కావలితాలూకాలోనిది. బాపట్లతాలూకాలోని పెదచెఱు కూరుశాసనములో మల్లిదేవచోడుఁడు కందుకూరిపురవరేశ్వరుఁ డనియుఁ గాశ్యపగోత్ర పాకనాటివిషయ ఏకవింశతిసహస్రగ్రామావనీ వల్లభుఁ డనియు నభివర్ణింపఁబడెను. (ప)

అనఁగా పాకనాడు నెల్లూరుజిల్లాలో నుత్తరమున గుండ్లకమ్మ నది, కందుకూరుతాలూకావఱకును, గుంటూరుజిల్లాలో దక్షిణమున

(ద) ఎపిగ్రాఫియా ఇండికా, సంపుటము 8. పుట 15.
(బ) ఎపిగ్రాఫియా ఇండికా, సంపుటము 3. పుట 27.
(ప) South Indian Inscriptions Vol. VI. No. 206.

ఒంగోలుతాలూకాయును జేరి తూర్పుసముద్రము నంటుకొని యుండె నని యూహింపవచ్చును. (ఫ)

## రే నా డు

ఈ రేనాటిశాసనములు కడపజిల్లాలోని పులివెండ్ల, ప్రొద్దుటూరు, జమ్మలమడుగు, కామలాపురము, చిత్తూరుజిల్లాలోని మదనపల్లితాలూకాలోను, కర్నూలుజిల్లాలోని కోవెలకుంటతాలూకాలోను వెలువడినవి. ఇటీవల ప్రభుత్వమువారు రేనాటిచోళుల శాసనముల నొక శీర్షికగ ప్రకటించియున్నారు. వానిలోఁ గొన్నింటి నుదాహరించుచున్నాను. (బ)

(1) పులివెండ్లతాలూకా–మూటుకూరు
శ్రీమత్ చోడమహారాజులు రేనాణ్డు ఏఱువేలనేల శ్రీమత్ భికిరజు నిల్పిన దత్తి

(2) ప్రొద్దుటూరుతాలూకా–ప్రొద్దుటూరు
కరికాలాన్వయ మహారాజు శ్రేనాణ్డేఱువేల......

(3) జమ్మలమడుగుతాలూకా–కొసిదేపల్లి
కరికాలాన్వయ శ్రీమత్ చోడమహారాజు రేనాణ్డు ఏఱు వేఱు నేఱంగా.

---

(ఫ) నెల్లూరిజిల్లా శాసనసంపుటము౹౹-ఒంగోలు (137); రాపూరు (36); వెంకటగిరి (1); C. P. 2; ఆత్మకూరు (31); నెల్లూరు (34); ఈవి శాసనములు పాకనాటిని పేర్కొనుచున్నవి. పాకనాటిలో పిడనాడు లేక పడనాడు లేక పడైనాడొక యంతర్భాగము. నెల్లూరు పాకనాటిలో పడనాటిలో నున్నదని నెల్లూరు తమిళశాసనముల వివరింపఁబడినది.

(బ) (1) (2) (3) (4) (5)–
దక్షిణహిందూదేశశాసనసంపుటము-10. సంఖ్యలు 594, 595, 598, 609 and 639.

(4) కామలాపురము తాలూకా-కలుమల్ల
ధనంజయున్డు రేనాణ్డు ఏళన.

(5) మదనపల్లి తాలూకా-చెన్నరాయనిపల్లి
శ్రీ బైయ్యుమ్బమహారాజు రేనాణ్డు ఏళువేళు ఏళుచుణ్డి...

(6) పుణ్యకుమారుని మాలెపాడు తామ్రశాసనము.

'స్వస్తి శ్రీ చోళమహారాజాధిరాజ పరమమహేశ్వర విక్రమాదిత్య శక్తికొమార విక్రమాదిత్యులకొడుకుళ్ కాశ్యపగోత్రున్డు సత్యాదిత్యున్డు సిద్ధివేయు రేనాండు ఏళు వేల ఏలుచున్ణి.'

ఈ రేనాటి శాసనములు ఏడెనిమిదిశతాబ్దముల నాఁటివి. ఆంధ్ర సారస్వత వచన వాఙ్మయ పరిణామ పరిశోధకులకు బంగారుగనులు. ఆంధ్రసరస్వతి యక్షరాభ్యాసమును నేర్చి, బాలశిశువు చేపట్టిన పవిత్ర భూమి యీ రేనాడు. ఈ రేనాటి శాసనగ్రామముల యునికివలన పూర్వము రేనాడు ఏడు వేల దేశమనునది, ఇప్పటి కడపజిల్లాలోని పులివెన్దల, కామలాపురము, కడప, ప్రొద్దుటూరు, జమ్మలమడుగు తాలూకాలును, కర్నూలుజిల్లాలోని కోవెలకుంట తాలూకాయును, చిత్తూరు జిల్లాలోని మదనపల్లె తాలూకాయును గలసి వ్యాపించియుండెనని యూహింపవచ్చును. కడపజిల్లాలోని తూర్పుభాగమున నున్న రాజంపేట తాలూకా పొత్తపి ముఖ్యపట్టణముగాఁ బాలించిన మధురాంతక పొత్తపిచోళులు, వారుపాలించిన ప్రదేశమునకు పొత్తపినాడని వ్యవహరించిరి. ఇది మేర్పాకనాడు లేక పశ్చిమపాకనాడని పేరునఁ బరగుచున్నది.

---

(6) ఎపిగ్రాఫియా ఇండికా సంపుటము-11. పుటలు 337, 346. ఈశాసనములోని 'సిద్దివేయు' అనునది కడపమండలములోని సిద్దవటమును సూచించుచున్నది.

## కర్నాడు

ఈ ప్రకరణప్రారంభమున నుదాహరించిన శ్రీశైలశాసనముగాక యచ్చటనే కాకతీయప్రతాపరుద్రునికాలము క్రీ.శ. 1312 సంవత్సరము నాఁటి శాసనమునందే కర్నాడు పేర్కొనఁబడినది.

"స్వస్తిశ్రీ మనుమహామండలేశ్వర కాకతీయ ప్రతాపరుద్రదేవ మహారాజులు ప్రిథివీరాజ్యము సేయుచుండంగాను స్వస్తిశ్రీ మనుమహా ప్రధాని వేపేటి కామయ్యంగారు శ్రీపర్వతము శ్రీ మల్లిఖార్జునదేవర మధ్యాహ్నఅవసరాలకు కల్లుమఠమువారికి కంన్నాటిలోని చిలుకలగుడి పాడు, పెసఆవాయం రేగడు ౫-౧౦ న్ని ఇస్తిమి. (ఫ)

ఈ 503, 504 సంఖ్యలుగల శాసనములలో నీయఁబడిన కన్నాటి లేక కర్నాటి గ్రామనామములఁ బరికించి చూడ నయ్యవి కర్నూలుజిల్లా నందికొట్కూరు నంద్యాలతాలూకాలలో విశేషముగఁ గాన్పించు చున్నవి. ఈ సుప్రసిద్ధక్షేత్రముసహితము కర్నాటిలోనిదే. కర్నాటికిఁ బూర్వమున పల్నాడు, కమ్మనాడు గలవు. (బ)

శ్రీ లక్ష్మణరావుగారు రెండవపులకేశి నూతన తామ్రశాసనమును ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక-పదునొకండవ సంపుటము, సంచిక 4-5 లోఁ బ్రకటించుచు శ్రీశైలము కమ్మనాటిలోనిదే యని వ్రాసియున్నారు.

"ఇప్పుడు కర్నూలుజిల్లా నందికొట్టూరు తాలూకాలోనున్న శ్రీశైలముకూడ శా. శ. 14వ శతాబ్దప్రారంభమునఁ గమ్మనాటిలోనిదై యుండిన ట్లచ్చట రెండుశాసనములు గలవు."

(ఫ) దక్షిణహిందూస్థానశాసనసంపుటములు-10. సంఖ్య 503.

(బ) నందికొట్టుకూరుతాలూకాలో శివపురము, సంగమేశ్వరము, కొత్తపల్లి గ్రామములలోని త్రైలోక్యమల్లుని కన్నడశాసనములలో నియ్యది కన్నెమూనూఱుల, కన్నెనాడు, కన్నెమూనూఱు అని పేర్కొనఁబడినది. (South Indian Inscriptions Vol. IX No. 119. 121 and 147.)

పై రెండు శాసనములలోఁ గర్నాడని యేకాని కమ్మనాడని లేదు. వారు నిర్దేశించిన రెండు శాసనములలోని యంశముల నీప్రకరణమున నిచ్చియేయున్నాను.

ఇంకొకవిషయమును జర్చించి, యీ కర్నాటివృత్తాంత మిందుతో విరమించుచున్నాను. పాలకురికి సోమనాథకవి బసవపురాణములో శ్రీగిరిపశ్చిమమునఁ గర్ణాటదేశ మున్నదని వ్రాసియున్నాఁడు.

గురుతరంబైన శ్రీగిరిపశ్చిమమున
వరనుతం బగుచుఁ గర్ణాటదేశ మనఁ
గడునొప్పు నందుఁ బ్రఖ్యాతసద్భక్తి
నడిసన్న హింగుళేశ్వరభాగవాటి
యనునగ్రహారమునందు విఖ్యాతి
మనుచుండు మండెగ మాదిరాజనఁగ.

ప్రథమాశ్వాసము.

శ్రీగిరికి పశ్చిమమునఁ గర్నాట ముండుటచేతను, సోమనాథకవి యుద్దేశించిన కర్ణాట మిదియేనా యనుభ్రాంతి కలుగుచున్నది. కాని హింగుళేశ్వరము బీజపూరుజిల్లాలో నున్నది. పూర్వము కర్ణాటదేశము కృష్ణ దాఁటి బీజపూరుమండలమువఱకు వ్యాపించియుండె ననుటకు చరిత్రాధారములు గలవు.

## ము లి కి నా డు

క్రీడాభిరామములో కృతికర్తయైన వినుకొండ వల్లభామాత్యుఁడు ములికినాటిలోని మోపూరు పాలించెనని యీక్రింది సీసపద్యములోఁ జెప్పఁబడినది.

సీ. మూఁడుగ్రామగ్రాసములతోడఁ గూడంగ
మోపూరు పాలించె ములికినాట
నాశ్వలాయనశాఖయందు ఋగ్వేదంబు
కరతలామలకంబుగాఁ బఠించె

ప్రత్యక్షు మొనరించి భైరవస్వామిచే
సిద్ధసారస్వతశ్రీ వరించెఁ
గామకాయనసవిశ్వామిత్రగోత్రంబు
వంశగోత్రంబుగా వార్త కెక్కె
గీ. నెవ్వఁడా త్రిపురాంతకాధీశ్వరునకు
రాయనవరత్నభండారరక్షకునకుఁ
బ్రియతనూజుండు చందమాంబికకు సుతుఁడు
మనుజమాత్రుండె వల్లభామాత్యవరుఁడు.

కృత్యంతమున ముల్కినాటిలోని భైరవస్వామిని గూర్చిన ప్రశంసయుఁ గలదు.

చ. ముదమున ముల్కినాటిపుర మోహనశైలసువర్ణకందరా
సదనుఁడు గాలభైరవుఁడు శంభునిపట్టి సమగ్రవైభవా
భ్యుదయపరంపరావిభవముల్ గృపసేయుఁ గవీంద్రకాంక్షిత
త్రిదశమహీరుహాంబునకుఁ దిప్పయవల్లభరాయమంత్రికిన్.

ప్రబంధరత్నావళిలో వల్లభరాయని వీథినాటకములోని దని యీక్రిందిపద్యములో ముల్కినాటిలోని మోపూరు పేర్కొనఁబడినది.

సీ. చంద్రఖండములతో సరివచ్చు ననవచ్చు
విమలదంష్ట్రాప్రరోహములవానిఁ
బవడంబుఁగొనలతోఁ బ్రతివచ్చు ననవచ్చు
కుటిలకోమలజటాచ్ఛటలవాని
నింద్రనీలములతో నెనవచ్చు ననవచ్చు
కమనీయతరదేహకాంతివాని
నుడురాజరుచులతో నొఱవచ్చు ననవచ్చు
చంచన్మదాట్టహాసములవాని
గీ. సిగ్గుమాలిన మొలవానిఁ జిఱుతవాని
నెల్లకాలంబు ములికినా డేలువాని

నర్థి మోపూర నవతార మైనవాని
భైరవునిఁ గొల్వవచ్చిరి భక్తవరులు.

ప్రాచీనశాసనములలో గౌతమీపుత్రశాతకర్ణి నాసికశాసనము లం దతఁడు జయించిన దేశములలో ములకదేశము పేర్కొనఁబడినది. ఈ ములకదేశము తర్వాత హ్రస్వమై ములకనాడై నదని కొందఱు చరిత్రకారులు వ్రాసియున్నారు. కాని నాసికశాసనములలోఁ బేర్కొనఁబడిన ములకదేశము వేఱు, ఈములకనాడు వేరేమో అని నాయభిప్రాయము. క్రీడాభిరామములోని మోపూరు కడపజిల్లా పులివెండ్ల తాలూకాలోని గ్రామము. ఆమండలములోని కడప, కామలాపురము తాలూకాలలోని కొన్నిగ్రామములు ములికినాటిలోనివని శాసనముల వల్లఁ దెలియుచున్నది. ప్రొద్దుటూరుతాలూకా ఉప్పరపల్లి శాసనములో కాకతీయ ప్రతాపరుద్రదేవమహారాజు గండికోటసీమకును, ములికినాటిదేశమునకును దనకుమారుని జుట్టయలెంక గొంకయరెడ్డిని నధిపతిని గావించెనని వ్రాయఁబడియున్నది. (య)

"శ్రీమనుమహామండలేశ్వర కాకతియ్య ప్రతాపరుద్రదేవ మహారాజులు సుఖసంకథావినోదంబుల రాజ్యంబు చేయుచుండ ఖండికోటకూను ములికినాంటి దేశములకూను తన ప్రియకుమారుల జుట్టయలెంకగోంకయరెడ్డిగారిని రాజ్యాభిషిక్తులం జేసె."

విజయనగరరాజ ప్రతినిధియైన రెండవసంగముని బిట్రగుంట శాసనములో 'ముల్కి'యను దేశము గలదనియు, నందు పుష్పాచలమను దేవళమున్నదనియు దాని కుత్తరదిశనున్న పెన్నానది కుత్తరతటమున సింకేసరి యను గ్రామ మున్నదనియు లిఖింపఁబడినది. (ర)

(య) దక్షిణహిందూదేశశాసనసంపుటము-10. సంఖ్య 536.

(ర) ఎపిగ్రాఫియా ఇండికా సంపుటము-3. పుట 24.

దేశో భూ న్ములికి ప్రథామధిగతః స్తత్రాస్తి పుష్పాచలో
నామస్తానమనుత్తమం పురరిపో స్తస్యోత్తరస్యాందిశి
పెన్నాయాః స్ఫుట సోత్తరత్రచ తటే సింకేసరీతి శ్రుతంగ్రామం।

కడపజిల్లా రాజంపేటతాలూకా అత్తిరాలగ్రామములో అంబదేవమహారాజు (క్రీ. శ. 1279) శాసనములలో నతఁ డీదేశము నేలుచుండెనని వ్రాయఁబడియున్నది. (౧)

"వల్లూరిపట్టణంబు రాజధానిగాను ఖండికోట ములికినాడు రేనాండు (పెడ) కల్లుసకలి, యెఱువ, పొత్తపినాండు లోనుంగా సకల దేశములు......"

పైని వివరింపఁబడిన దేశములన్నియు నిప్పటి కడపమండలములోనివె.

## స బ్బి నా డు

ఆంధ్రసారస్వతములో సబ్బినాటిని మొదట పేర్కొన్న కవి మడికి సింగన. ఈకవి తాను రచించిన పద్మపురాణోత్తరఖండమునఁ దత్కృతిపతియగు కందనామాత్యునిగూర్చి యిట్లు వ్రాసియున్నాఁడు. ఈకందనామాత్యుఁ డార్వేలనియోగిబ్రాహ్మణుఁడు. సబ్బినాటి నేలిన ముప్పడిభూపతికి మంత్రి. ఆవిషయములో కవి యిట్లు వ్రాసియున్నాఁడు.

"తత్కవితావధూముఖతిలకంబగు వెలిగందల కందనామాత్యుం డను నుత్తమరత్నంబున కుపాశ్రయంబగు రామగిరిపట్టణాధీశ్వరుండైన ముప్పడిక్షోణిపాలుని యన్వయగుణవిశేషంబులెట్టివనిన......"

అని ప్రశంసింపందగి విభవ విలాస విక్రమ విజయ విఖ్యాతులం బ్రసిద్ధుఁడైన ముత్తభూపాలుండు తనకు సహాయుండుగా గౌతమీదక్షిణంబునం బరమపావనమగు సబ్బినాటిరాష్ట్రంబున రామగిరిపట్టణంబు

(౧) దక్షిణహిందూదేశ శాసనసంపుటములు-10. సంఖ్య 448.

రాజధానిగాఁ బురందరవిభవుండై రాజ్యంబు చేయుచు, నిరువెత్తుగండ, గండగోపాల, కాంచీరక్షపాలక, చోడరాజ్యస్థాపనాచార్య, దొంతి మన్నియవిభాళన, చలమర్తిగండ, గజగండవారణ, రాయగజకేసరి, మూరురాయరగదాళాది నానాబిరుదవిఖ్యాతుండును, అనవరతదాన శీలుండును నగు ముప్పభూపాలచంద్రునకు నిఖిలసామ్రాజ్యభారధురంధరుండును, ధర్మచరిత్రుండును, చాతుర్యవివేక విశేషగుణగణాలంకారుండునునై యమ్మహారాజు మన్ననవడసి విశేష వస్తు వాహన ఛత్ర చామరాందోళికాది చిహ్నంబులం బెంపొందు కందనామాత్యు వంశావతారం బెట్టిదనిన......"

పైని చెప్పఁబడిన సబ్బినాడు నేఁటి యాంధ్రదేశమున గోదావరికి దక్షిణమున వేములవాడ ధర్మపురి మొదలగు ముఖ్యగ్రామములు గల కరీంనగరుజిల్లా. దీనికే సబ్బిసాయిరమండలమని పేరు. (అనఁగా సబ్బి వేయింటి దేశము) రామగిరి కరీమునగరజిల్లాలోనె కలదు.

## క్రీడాభిరామము – నాడులు – కురవాటము

క్రీడాభిరామ కావ్యమునందలి యానాఁటి యాంధ్రదేశ సాంఘిక పరిస్థితులఁ దెలిపెడి విశేషముల నిదివఱకే కొందఱు వ్రాసియున్నారు. ఈకావ్యము రచించుకాలమునాఁటికి ఆంధ్రదేశములో వ్యాప్తమైయున్న రాష్ట్రవిభాగములైన నాడులఁగూడ నిందు వివరింపఁబడియుండెనని యిదివఱకు దృష్టాంతములఁ జూపియున్నాను. రెడ్లచరిత్రమునకు సంబంధించిన యొకదేశవిభాగము చరిత్రకారులకుఁ బ్రకాశముగానిది దీనిలో నొకటి.

కోరుకొండసీమనేలిన ముమ్మడినాయకుఁడు ఉభయగోదావరీతట మధ్యప్రాంతమందలి కోన, వానార, కురవాట, చెంగరల నేలు

చుండెనని యితని శాసనములవల్లఁ దెలియుచున్నది. (వ)

(1) ప్రథితోభయగోదావరీమధ్యప్రాంతేషు మహితసౌభాగ్యవాన్
పాలయతి ముమ్మడీంద్రశ్చెంగళి, కుళివాట, కోన, పానరాన్॥

(2) పాణార, కోన, కురవాటక, చెంగరాదీన్
గోదావరీ ముభయతోయ ముపాంత దేశాన్
జత్వావనాచల జలస్థలదుర్గరమ్యా
నేకః ప్రశాస్తి చిర మప్రతిశాసనం సః॥

కోన యనగా నిప్పటి తూర్పుగోదావరిమండలములోని కోన సీమ యనియు, పానార మనఁగా నిప్పటి పశ్చిమగోదావరిమండలములోని నరసాపురము, పాలకొల్లు తాలూకాప్రాంత మనియు, చెంగళి యనఁగా తూర్పుగోదావరిమండలములోని పెద్దాపురముతాలూకాలో చాగల్నాడని వ్యవహరింపఁబడు మన్యప్రాంత మనియు నిదివఱకు చరిత్రకారులు నిర్ణయించియున్నారు. ఈవిషయము రాఁబోవు ప్రకరణమున నుదాహరణపూర్వకముగ వ్రాయుచున్నాను. ఇఁక మిగిలినది కురవాటము. ఇది యేదియో తెలియక వదలివేయఁబడినది. ఈ కురవాటకప్రాంతనిర్ణయమునకు క్రీడాభిరామము ప్రబలప్రమాణము.

మధుమావతి భావికాలజన్మమును గూర్చి యొకజోగి వ్రాసిన దని చెప్పిన పద్యములో నీమధుమావతి తర్వాతిజన్మమున దాక్షారామమున చిన్నిపోతియను వేశ్యకాంతయై పుట్టుననియుఁ దర్వాత నీమె కురువాటికాదేశమందు చెంచుతయై జన్మించుననియుఁ గలదు.

---

(వ) (1) ముమ్మడినాయకుని శ్రీరంగము శాసనము. క్రీ. శ. 1368.
ఎపిగ్రాఫియా ఇండికా సంపుటము-14. పుటలు 83-96.

(2) ముమ్మడినాయకుని కోరుకొండశాసనము. క్రీ. శ. 1363.
దక్షిణహిందూదేశ శాసనసంపుటము, 10. సంఖ్య 554.

సీ. అలకాపురంబున నంగారవర్ముండన్
గంధర్వపతికన్య కమలపాణి
యాదివ్యగంధర్వి కపరావతారంబు
మధుమావ తోర్గంటిమండలమున
నాసుందరాంగి ద్రాక్షారామమునఁ బుట్టు
భువనమోహిని చిన్నిపోతి యనఁగ
నట్టి సత్ స్త్రీజాతి యాసానికూఁతురు
చిరకాలమున సదాశివునిగూడి

గీ. పావనంబైన తమిలేటిపరిసరమున
వేఁగి కురువాటికా దేశ విపినభూమి
గోవు లను పేరిటఁ జెంచుకులమునందుఁ
గడిమికత్తులయమ్మనాఁ గలుగఁగలదు.

క్రీడాభిరామము పుట 79 (శృంగారగ్రంథమాల)

కురువాటిక యనునది వేంగిమండలములోని తమ్మిలేరుప్రాంత భూమి యని స్పష్టముగ వ్రాయఁబడినది. ఈ తమ్మిలేరు ఏలూరునకు సమీపముగఁ బ్రవహించు నొకప్రసిద్ధమైన యేరు. కురువాటిక యను నది గోదావరి దక్షిణతటమున తమ్మిలేరు పరిసరప్రాంతము-అనఁగా నిప్పటి కొవ్వూరు ఏలూరు తాలూకాలకు సరివచ్చునని చెప్పవచ్చును. గోదావరి కొకవైపున కోనయుఁ జెంగరయు, నింకొకవైపున పానారము కురవాటకము గలవు- గోదావరి కుభయతటముల నున్న శాసనములో వ్రాయఁబడిన నాల్గుసీమలును మనకు క్రీడాభిరామకృతిలో వర్ణింపఁబడిన కురువాటికా దేశముతోఁ బూర్తిగాఁ దెలియవచ్చినవి.

(సశేషము)

# హైందవశిల్పచిత్రములు

## సంగ్రహచరిత్ర

శ్రీ విశ్వనాథ నరసింహము, యం. ఏ. బి. ఇడి.,

## అనుక్రమణిక

శ్రీలకు నాకరం బయిన సీమ మన హిందూదేశము. విద్యాలయ మనియు మహాత్ముల జన్మభూమి యనియు దిగంతవిశ్రాంత మగు యశస్సు మన దేశమున కే సంక్రమించినది. వేదయుగమునాఁటి శాశ్వత నాగరకత మన దేశమునం దుండెనని పాశ్చాత్యప్రముఖు లామోదించిరి. సమస్తసస్యశ్యామలకోమల మగుభారతావని పాఁడిపంటల కాకర మగుట ప్రాచీనకాలములోఁ బ్రసిద్ధముగా నుండెను. ఇంతియ కాక పాశ్చాత్యదేశము లన్నియు నజ్ఞానాంధకారమునఁ దడవులాడుతఱి మనహిందూదేశమున వాని కన్నింటికింగూడ మార్గదర్శకమైన జ్ఞానభానూదయ మయిన దని విశద మగును.

అట్టిహిందూదేశమునఁ బ్రాచీను లఱువదినాలుగుకళలఁ జేర్కొనిరి. అందుఁ గొన్నింటిని లలితకళ లని వ్యవహరించుట విశదవిషయము. లలితము లన మనోహరములు. సంగీతసాహిత్యములును భరతనాట్యాదులు నందే ముఖ్యమగు లలితకళలుగా నెన్నఁబడుచున్నవి. శిల్పచిత్రలేఖనములుగూడ ముఖ్యకళ లయి మనభారతదేశమున మిగుల నభివృద్ధిఁ గాంచినట్లు వేదకాలమునుండియు నిదర్శనములు కానవచ్చుచున్నవి. బంగారు తేరులు బంగారుకవచములును ఋగ్వేదములోఁ గనకభూషణాలంకారములతోఁ గూడఁ జేర్కొనఁబడియుండుటచేఁ బ్రాచీనకాలముననే శిల్పచిత్రకళ లీదేశమునం దుండినట్లు తెలియును. ఆకాలములో ఈజిప్టు పారశీకములు కొంత కొంత నాగరకత నందినను తక్కటి దేశములు కనులు తెఱచినట్లు కనుపింపదు.

'కృషితో నాస్తి దుర్భిక్షమ్' అనుటవలనఁ బ్రాచీనకాలము నుండియు హైందవులకు వ్యవసాయము ముఖ్యవృత్తి యని తెలియును. నేతపని ప్రత్యేకకళగా వృద్ధిఁ జెందినట్లును కృషికి వలయు పనిముట్లు గూడ తయారగుచుండె ననియు వేదకాలమునుండియుఁ దెల్లియు చున్నది. అట్టిపనులలోఁ గళావిన్యాస మున్నట్లు స్పష్టము. అట్టికళా విన్యాసము రాజాదరణంబున మఱియు నభివృద్ధిఁ గాంచుచుండెను. ప్రత్యేకమగు చేతిపను లెన్నియోకుటుంబములలో వృద్ధిఁ బొందు చుండెను. దేశము సుభిక్షముగా నుండి శత్రువులదండయాత్రలు మున్నగునుపద్రవములు లేనపుడు ధనికప్రభువులు పరిపాలకులును ధనమును వెచ్చించి కళలఁ బ్రోత్సహించుచుండిరి. హైందవశిల్పచిత్ర కారులనేకాక పారసీకాదిదేశములనుండి కళాకారుల రావించి ప్రోత్స హించుచుండిరి. అందుననే మనదేశశిల్పములయం దన్యదేశవిన్యా సము గోచరించుచున్నది. గాంధార మొగలు శిల్పములలో విజాతీయ లక్షణము లున్నను అయ్యవి జాతీయములై యాహ్లాదకరము లగు చున్నవి. అక్బరు షాజహానుచక్రవర్తులు మన హైందవకళాపోషకు లుగా నశాంతము నెంచఁబడుచున్నారు. వారియాస్థానముల కవుల కును శిల్పచిత్రకారులకును అత్యున్నతస్థాన ముండినట్లు తెలియును. వారికాలమున స్వర్ణాలంకారములలో స్థగితములయిన రత్నము లెంతయు వింతఁగొలుపును. సాలువలును తివాచీలును పనితనమున నచ్చెరు వొదవించును. వెండిబంగారుపాత్రలపై శిల్పులచాతుర్యము జీవకళల విరజిమ్ముచుండుట యెంతయు స్తోత్రపాత్ర మగును. తక్కటి సామాన్యప్రభువులుకూడ శిల్పచిత్రవిద్యాదిలలితకళల నెంతయుఁ బ్రోత్సహించి రనుట కనేక నిదర్శనము లున్నవి.

విక్టోరియామహారాణి తనయాస్థానమునందలి ప్రభుకుటుంబ వివాహములందు వధువునకుఁ గానుకగా నొకకాశ్మీరసాలువ నిచ్చుట

యాచారముగా నుండెను. మంచినగిషీపనిగల సాలువలు రెండువందల సవరనుల మొదలు వేయిసవరనుల విలువకూడఁ బడయుచుండెను. అట్టిరాంకవాదు లొనరించు చతురు లగుచిత్రకారులు మున్నగువారు క్రీ. శ. 1843వ తేఁమవరిస్థితులు కాశ్మీరమున సంభవించినపుడు పంజాబురాష్ట్రములోని అమృతసరము మున్నగు ప్రదేశములకు వలస వచ్చినంత అచటిపనులు వెనుకఁబడినవి. పాశ్చాత్యులలో ముఖ్యముగా పరాసువారు ఇట్టిపనులు చేయుటలో పోటీచేసిరి. వారిపద్ధతు లెక్కువ మక్కువతోఁ జూడఁబడినను కేవలము పనితనమునందలి చాతుర్యమునుమాత్రమే పరిగణించి పాశ్చాత్యపండితు లట్టివానిని హైందవ చిత్రకారుల వజ్రములముందు గాజుపూసలవంటి వనియభిప్రాయపడిరి.

కాలక్రమమున మన దేశము విదేశీయపరిపాలనకు లోనయినది. రాజానుమతములుగా మతములు మాఱుచుండెను. జైన బౌద్ధమతములు కొంతకాలమును తరువాత మహమ్మదీయ క్రైస్తవమతములును ప్రాతినిధ్యము వహించినను హిందూమతము క్రొత్తపోకడల ననుసరించిన దేకాని యాయామతముల యాధిపత్యమునం దంతర్లీనము కాలేదు.

భారతదేశమునఁ గళ లనంతములు. ఆకళలు జీవితమును వ్యక్తపఱచ సమర్థములు. మనోవికాసములను రాగాంతరములను భావసూక్ష్మతలను జిత్తవిభ్రమాదులను వ్యక్తమొనరించును. హైందవుల కళాదృష్టి వారిజీవనపథమునుండి వేఱుపడనిది- అనఁగా హిందువులజీవనపథమునకును వారికళాదృష్టితో నత్యంతసన్నిహితసంబంధమున్నది. కళకుఁ గళయే ప్రయోజన మనుకొనుట నైహికవాంఛాతత్పరు లగుపాశ్చాత్యుల దృక్పథము. అట్టి సమాలోచనము ప్రాచ్యదృష్టిలోఁ గనరాదు. కళలద్వారమున మతతత్వశాస్త్రవిషయముల సమ్మిశ్రిత మొనరించి సాధించుటయే మనయాదర్శము. అందుచేఁ

బురోహితులయనుశాసనముల ననుసరించి మనకళావిన్యాసము కావ్యరూపములను శిల్పచిత్రరూపములను తదితరస్వరూపములను పొందినది. ప్రాచీనాచార్యులు మన దేవళములలోని దేవతాస్వరూపములను నిర్మించుసూత్రములను శిల్పచిత్రకారులకు నియమవిధుల నిర్మాణించిరి. అట్టి విధానముల ననుసరించి శిల్పచిత్రకారులు లాయా దేవతావిగ్రహముల నిర్మాణ మొనరించుచుండిరి. అట్టిశిల్పచాతుర్యము సంప్రదాయసిద్ధముగా జనకునివలన సుతునకును తదుపరి వారిసంతతివారును క్రమముగా నేర్చుకొనుచుండిరి.

హైందవకళాస్వరూపములు ప్రధానముగా మతాచార్యుల నియమితసూత్రములకు సంబంధించినవిగా నున్నను పరిశ్రమలకును కథాకథనములకును పనికివచ్చుకళలు ప్రత్యేకనిబంధనల ననుసరించి ప్రత్యేకవ్యక్తులు పుష్టినొందించుచుండిరి. అయినను హైందవులకు జీవితమంతయుఁ బవిత్రసంస్కారసంబంధి యగుటఁబట్టి మతాచార్యనియమితసూత్రముల ననుసరించు లలితకళానిర్మాణములనే, మతతత్త్వశాస్త్రాదేశసమ్మిశ్రితవిషయప్రసక్తులనే ఇతరులగు పరిశ్రామికులును కథాకథనకళలు లగువారునుగూడ అనుసరించుచుండిరి. అందుచే మతప్రసక్తప్రధానమై తత్త్వశాస్త్రాదేశతత్పరులగు హైందవులకళలలో నెల్లెడల ఆచార్యాదేశానుసరణము లుండుట సామాన్యవిషయము. ఇతర పారిశ్రామికకళ లన్నియు వారి యడుగుజాడలలో నడచుచుండెను. దేవతాసంబంధ మగుశిల్పచిత్రకళలు ప్రధానములై తక్కటికళ లన్నియు వానిపాదచ్ఛాయలలో వెనుకొని నడచినవి.

భగవంతుఁడు స్వీయానందముకొఱకు విలాసముగా సృష్టికింగడంగి సకలచరాచరజగంబులను నిర్మాణించెను. అందుచే మొట్టమొకటి శిల్పిగాను చిత్రకారునిగాను ఆపరాత్పరునే మనము భావింపవలసియున్నది. తనస్వరూపమునే యనేకచరాచరాత్మకప్రపంచజీవ

రాసులలో వెదజల్లి తదీయానందానుభవము నాపరమేశ్వరుఁడు పొందువాఁడయ్యెను. అందుచే భగవన్నిర్మాణములలో సత్యోత్తమముగా నెంచఁబడు మనుష్యులు

"భూతానాం ప్రాణినః శ్రేష్ఠాః ప్రాణినాం బుద్ధిజీవినః
బుద్ధిమత్సు నరాః శ్రేష్ఠా........" మనుస్మృతి.

భగవానునిసందేశముల సమస్తవస్తువులయందును తిలకించుచు ఆపరాత్పరుని సన్నిధానము నందుటకును తత్స్వరూపముతో నేకీభావము నందుటకునుగూడ అఖిలప్రయత్నములఁ జేయుచుఁ గళోపాసనామూలమున, కవితాప్రసక్తిమూలమున, నృత్యగీతాదులమూలమున ఆతని సంకీర్తన మొనరించుట సంప్రదాయ మయ్యెను. కావున శిల్పులయినను చిత్రకారులయినను వారొనర్చునిర్మాణములలో మతిసంబంధమగు నభిప్రాయములు స్థిరత్వము దాల్చినవి. అందుచే ప్రతివస్తునిర్మాణమునందును అత్యంత మస్వరూపచింతనము కాన్పించుచున్న దేకాని వేఱుపరమావధి యొండు లేదు. వృక్షములు కుసుమలతాదులు పక్షులు జంతుజాలములు మున్నగునవన్నియు ప్రకృతినుండి గ్రహింపఁబడి ఆయా కళోపాసకులచే దివ్యలోకవిహారమునకుఁ గొంపోఁబడిన ప్రతిచిత్తరువులోని సూక్ష్మవర్ణనమునందును ప్రతిశిల్పవిన్యాసమునందునుగూడ భగవంతుని దివ్యలీల కాన్పించుచు భగవంతుఁడు సృష్టిలో ప్రతిసూక్ష్మవస్తువునందు నిండియుండె ననుసందేశము మానవుల కెల్లరకును వ్యక్తము చేయుచున్నది. కళలన్నిఁటికి పరమావధి యొక్కటియే. అయ్యది భగవంతుని తేజోవిలాససౌందర్యసమార్చనము.

ఇఁక పాశ్చాత్యులకు రూపమునందును హైందవులకు భావవ్యక్తీకరణమునందును ఎక్కుడభినివేశము కాన్పించును. విశ్వవ్యాప్తమగు పరమాత్మస్వరూపము నే వర్ణించుచు భారతీయులు కావ్యరచన మొనరించిరి. చిత్రకారులు చిత్రముల నిర్మించిరి. శిల్పులుకూడ రూప

నిర్మాణసౌందర్యముచే హృదయాహ్లాదమును కల్పించిరి. గాయకులు తమదివ్యగానముచే వీనులవిం దొనర్చి యానందానుభవమును గల్గించిరి. మఱియు లలితకళల కితరములగు నీతిశాస్త్రికులతో సంబంధము లేదనియు సౌందర్యస్వరూపనిర్మాణ మొనరించుటయే వాని ముఖ్యప్రయోజన మనియుఁ గొందఱియభిప్రాయము. అట్టికళలు హైందవ శిల్పచిత్రలేఖనములయందేమి, కావ్యజగత్తునందేమి సామాన్యముగా మనకుఁ గనరావు. భారతీయచిత్రకారులచిత్రములు భావస్ఫోరకములగుచున్నవి. భావముయొక్క లావణ్యపరిమాణములు తదీయసాదృశ్యమునందుఁ గాన్పించును. రూపము భావము ననుసరింపవలెనేకాని భావము రూపముచే బంధింపఁబడదు. పాశ్చాత్యశిల్పులు వాస్తవజగత్తు నొక్కయావరణముగాఁ దీసికొని తదీయావరణమునందే సంచరించిరి. కాని తత్ ద్వారమునుండి విముక్తులు కాలేదు. హైందవ శిల్పియన్ననో వాస్తవజగత్తును దేవతలకు పాదపీఠముగ నొనరించెను. లక్ష్మీదేవిని కమలాలయగా నిర్మించెను. చతుర్భుజుండగు విష్ణువును నాగేంద్రశయను నొనర్చెను. పరమశివుని వృషభేంద్రవాహనుఁ జేసెను. సరస్వతీదేవిని హంసారూఢఁ గావించెను. మర్త్యలోకముపై నిర్జరలోక తేజఃపుంజములఁ బ్రసారితములుగాఁ జేయుటయే భారతశిల్పచిత్రకారుల పరమలక్ష్యము.

శిల్పవిద్యకు సంబంధించిన ఱాతిచెక్కడములు, కఱ్ఱపని అను వానిలోఁ గఱ్ఱపనియే ముందు బయల్వెడలినదని పాశ్చాత్యు లభిప్రాయపడిరి. అట్టి యభిప్రాయకారణము కొయ్యపనులకు వలయు ప్రమాఁకులు సులభముగా లభ్యము లయినవనియు నందువలనఁ గఱ్ఱపనులు తొలుత ప్రాబల్యములో నుండెననియు వా రూహించిరి. కాని ప్రాచీనకాలమునందే శిలానిర్మాణములు వృద్ధిఁజెందినట్లు భూగర్భపరిశోధన లొనర్చి పాటలీపుత్రము, నలందా, తక్షశిల, హరప్పా మున్నగుప్రదేశములయం

దలి పొరంగములవలనఁ దెలియుచున్నది. మఱియు కొయ్యపనులు చేయు శిల్పు లావిద్య ఱాతిప్రతిమ లొనర్చువారికడ తెలిసికొని రని చెప్పనగును. మఱియొకవిషయ మేమన ఱాతిపనులు చేయువారును, కొయ్యపను లొనర్చువారు నొకేజాతికిఁ జెందియుండిరి. కావున నందుఁ గొందఱు రెండువిధము లగుపనులఁ జేయుటలో సమర్థులుగా నుండిరి. కొయ్యపనిచేయు శిల్పికుమారుఁడు ఱాతిపనిముట్లు స్వీకరించుచుండెను. అట్లే ఱాతిచెక్కడములలోఁ బ్రవీణుఁడగువాని సంతతివారు కఱ్ఱపనులు చేయుచుండిరి. శిల్పచాతుర్యముగల పనివాఁడు ఱాతిపనినైనను కొయ్యపనినైనను హెచ్చులొచ్చు లనుమాట యెంతమాత్రమును లేకయుండఁ జేయ సమర్థుఁడైయుండె ననుటచే నాయాకళలు కవల వలె వర్ధిల్లె నని తెలియుచున్నది. అందుచేత నీహైందవభూమియందు వాస్తుశాస్త్రనిర్మాణములగు దేవాయతనములుమున్నగునవి యెంతటిప్రాచీనములో ఱాతిపనులును కొయ్యపనులునుగూడ నంతటిప్రాచీనాభివృద్ధి నందియుండె నని తెలియనగును.

సారస్వతాధారములఁ గైకొనినయెడల రామాయణమహాభారతములు రెండిటిలో- కావ్యేతిహాసములలో- దేవాయతనములు, సౌధప్రాసాదములు, ఱాతివిగ్రహములు, చంద్రకాంతశిలానిర్మితము లగు నితరస్వరూపములును వివరింపఁబడియుండుటచే నాయాశిల్పవిద్యలు క్రీ. పూ. 5000 అయిదువేల సంవత్సరములనుండి యభివృద్ధిలో నున్నట్లు మనము విశ్వసింపవలెను. శిల్పకుటుంబములవారు వారివిద్యలకెల్ల మూలపురుషుఁడైన దేవశిల్పి యగు విశ్వకర్ముఁ డనువాఁడు సామాన్యముగా కొయ్యపని చేయువాఁడనుట పొరపాటనియు నాతఁడు ప్రసిద్ధశిలాహర్మ్యనిర్మాత యనియు విశిష్టశిల్పము శిలానిర్మాణమునందే గమనింపఁదగు ననియుఁ దెల్పుచున్నారు.

మఱియుఁ జిత్రలేఖనవిద్యగూర్చిన ప్రాచీనతను దెల్పుట యనావశ్యకము కాదు. వేదము లెల్ల భగవత్ప్రసాదితములో వివిధేతర విద్యలుగూడ పరమేశ్వరప్రసాదితములు. పూర్వ మొకబ్రాహ్మణ పుత్త్రుఁ డకాలమరణము నొంద నాతనితండ్రి శోకపరీతచేతస్కుఁడై దుఃఖాతిరేకము నాఁపఁజాలక పుత్రునిజీవముల నిమ్మని మృత్యుని కధిదేవతయగు యముని ప్రార్థించెను. అతఁ డూరకయున్న బ్రాహ్మణుఁడు బ్రహ్మదేవుని పరిపరివిధములఁ బ్రార్థించెను. బ్రహ్మ దయామయుఁడై మృతపుత్రుగాత్రము పంచభూతముల విలీనమగుటచే మరల సృజింపఁజాలమి యాకుమారునిరూపము వ్రాయుటకై కుంచెలను రంగులను సృజించి వాని కిచ్చెను. ఆబ్రాహ్మణుఁడు తనగారాబుతండ్రియైన పుత్రునిరూపమును స్మరించి యొకయాకారమును నిర్మింప దానికి బ్రహ్మదేవుఁడు ప్రాణ మాపాదించెను. తరువాత నీచిత్రలేఖనవిద్య యనేకవిధముల వ్యాప్తిఁ జెందెను. ఈయుపాఖ్యానమునం దెట్టిసత్యాసత్యములున్నను చిత్రలేఖనము ప్రాచీనకాలమునుండియుఁ బూజ్యస్థానము వహించి రాజగౌరవాదులచే వృద్ధినొందె నని విశ్వసింపనగును.

సౌందర్యము చాల ముఖ్యమయిన దనుసిద్ధాంతము కావ్యకళను గూర్చియు, దృశ్యశ్రావ్యముల రెండింటియందును నాట్యమునందును గూడ హైందవులచే నెన్నికఁగన్న విషయము. కావ్యనిర్మాణ మొనర్చునపుడు కావ్యజగత్తు నత్యంతరమ్యముగా నొనర్చి కవి ప్రేక్షకులకును శ్రోతృలోకమునకునుగూడ మిగుల నాహ్లాదము గల్గఁజేసి వారి నానందనిమగ్నుల నొనర్చును. అట్లే నాట్యశాస్త్రానుసారమైన యభినయాదులొనరించునటుఁడు ప్రేక్షకులగు సామాజికులలో నాయారసము లుప్పతిల్లఁజేయును. అట్లే ఆనందానుభవము లలితకళలలోని శిల్పచిత్రలేఖనములకుఁగూడ పరమావధిగా నెంచఁబడుచు. హైందవశిల్పచిత్రకారులచే నానందానుభూతి యితరులకుఁ బంచిపెట్టఁబడుచున్నది. అందు

మూలముననే 'ఆనందో బ్రహ్మ' యనురీతి ఆనందమయమగు బ్రహ్మ స్వరూపసాధనమును ఆయాశిల్పోపాసకులు చేయుచున్నారని తెలియ నగును.

"ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతానిజాయంతే, ఆనందేన జాతాని జీవన్తి" అను నుపనిషద్వాక్యముల నీసందర్భమున స్మరింపవలెను.

# 2

# ప్రాచీనకాలశిల్పచిత్రలేఖనములు

## వైదిక ద్రావిడార్యయుగములు

ఆర్యసంస్కృతికి సంబంధించిన సారస్వతము సంస్కృతభాషలో నున్నది. వేదములు వేదాంగములు మున్నగున వన్నియు దేశభాష నాఁబడు సంస్కృతమునం దుండుట సుప్రసిద్ధవిషయము. భావావేశ పరవశుఁడైన వాల్మీకి తొలుతటికావ్య మగు శ్రీమద్రామాయణ మును రచించెను. అదియే మొదటి కావ్యకళాసృష్టి. కళాసృష్టి కావ శ్యకము భావావేశము. నిశ్చలధ్యాననిమగ్నుఁడైనకళోపాసకుఁడు భావావేశముతోఁడఁ గళాసృష్టి నొనరించును. అట్టికావ్యజగత్తును నిర్మించిన వాల్మీకి యార్యసంస్కృతికి మూలకందము. తరువాత వ్యాస మహర్షి వేదవిభాగ మొనర్చి యష్టాదశపురాణముల నిర్మించెను. వేద ములలోఁ బ్రకృతిసంబంధ మగు పంచభూతములస్తోత్రాదులు ప్రధాన ముగా నుండ, పురాణములలో నానావేదోక్త దేవతలకు రూపకల్పనము ప్రోదిఁ బొందినది. దేవతలప్రభు వగు దేవేంద్రుఁ డైరావతమను వెల్ల యేనుఁగు నెక్కునట్లు తెలుపఁబడినది. సప్తాశ్వములతోడిరథారూఢుఁ డైనవాఁడు సూర్యదేవుఁడు. అట్లే వరుణాగ్నులు మున్నగు దేవతలకు రూపకల్పనమును వాహనములును వివరములుగా వర్ణింపఁబడినవి. యమధర్మరాజు నల్లనియాకారము గల్గి మహిషవాహనము గలవాఁడు. సోముఁడు నాల్గుచక్రములరథము నధిరోహించును. కుబేరుఁడు సుంద

రాకారము గల్గి బ్రహ్మదత్త మగు విమానారూఢుఁడై చరించును. చతుర్ముఖుఁ డగు బ్రహ్మదేవునిగృహిణి సరస్వతి సౌందర్యవతి. ఆమె నుదుట చంద్రవంకఁ దాల్చి హంసవాహనము నొందెను. విష్ణుమూర్తి దశావతారములు- మత్స్యకూర్మవరాహాదిరూపములు- వహించుట ప్రసిద్ధము. అందు నృసింహావతారము భయంకరము. అన్నిటికంటెఁ గృష్ణావతారము, పిల్లనగ్రోవి నూదుచు నాలమందల సమ్మోదమందఁ జేయుకృష్ణుఁడు, గోపికావల్లభుఁ డైనకృష్ణుఁడు, రాధికాప్రియుఁ డైన కృష్ణుఁడు మోహనాకారుఁడుగా నెల్లరి నానందింపఁజేయు మూర్తి మంతుఁడు.

తరువాత బుద్ధునియవతార మొకవిశిష్టతఁ గాంచినది. బ్రహ్మ తేజముతోఁ బద్మాసనస్థుఁ డైనబుద్ధునియాకార మెంతయు సంతసము గొల్పును. కలియుగాంతమునఁ బరాత్పరుఁడు కల్కియవతారమున దుష్టశిక్షణ మొనరింపఁగలఁ డనుసూక్తి యున్నది. మఱియు వటపత్ర శయనుఁ డగునారాయణుఁడు శేషశయ్యను బండియుండుట వేఱొక యాకార మగును. శివునియాకార మనేకవిధముల నొప్పారును. సాంబశివుని స్వరూపము అర్ధనారీశ్వరుఁ డనఁ బరగుచు సగభాగమున శక్తి నాఁబడు పార్వతీదేవిగాఁ జిత్రించిరి. ఈ కల్పనావిశేషములో నొక రూపము క్రమముగా నుండును. రెండవది ప్రసన్నము. వృషభ మాతని వాహనము. శాంతుఁడును పద్మాసనమం దున్నవాఁడును శశధర మకుటుండును పంచముఖంబులఁ బరగువాఁడును లలాటనేత్రము గల వాఁడును పార్వతీశుఁడు. మఱియు నాతని దక్షిణహస్తమునఁద్రిశూల మును వజ్రాయుధమును ఖడ్గమును ధరించి పరశువునుగూడఁ గైకొని మఱియొకచేత భక్తుల కభయప్రదాన మొనరించుచున్నాఁడు. వామ భాగంబున నాగమును పాశమును ఘంటను ప్రళయాగ్నిని అంకుశమును ధరించి నానాలంకారయుక్తుఁడై స్ఫటికమణినిభుఁ డైనాఁడు పరమేశ్వ రుఁడు. అట్టియాకారమును గొంద ఱర్చింతురు. (సశేషము)

अन्यत्वमप्यनयोर्न सम्भवतीत्याह—

अन्य एव पुनर्गन्ता गतेरिति विकल्प्यते ।
गमनं स्यादृते गन्तुर्गन्ता स्याद्गमनादृते ॥१९॥

यदा गन्तृगमनयोरन्यत्वं स्यात्तदा गमननिरपेक्षो गन्ता, गन्तृनिरपेक्षं च गमनं स्यात् । नहि घटपटयोरिव गन्तृगमनयोर्नैरपेक्ष्यमस्ति । तस्मात्स्थितमेतत् 'अन्य एव पुनर्गन्ता गतेरिति न युज्यते' इति ॥१९॥

एवंविधविचारस्य फलमाह—

एकीभावेन वा सिद्धिर्नैकीभावेन वा ययोः ।
न विद्यते, तयोस्सिद्धिः कथं नु खलु विद्यते ॥२०॥

ययोर्भावयोरेकीभावेनानेकीभावेन वा सिद्धिर्न विद्यते तयोस्सिद्धिरेव न सम्भवति । प्रकारान्तराभावादिति भावः ॥२०॥

ननु गन्ता देवदत्तो गच्छतीति लोकप्रसिद्धम्, यथा वक्ता भावं भाषते, कर्ता क्रियां करोतीति च लोकप्रसिद्धमेव । तथा च यया गत्या गन्तेत्युच्यते देवदत्तस्तामेव गतिं स प्राप्नोतीति चेन्नैवमित्याह—

गत्या ययोच्यते गन्ता गतिं तां स न गच्छति ।
यस्मान्न गतिपूर्वोऽस्ति स तां गच्छेत्कथं खलु ॥२१॥

यया गत्या देवदत्तो गच्छतीत्युच्यते गन्ता सन्देवदत्तस्तां गतिं न गच्छति – न प्राप्नोतीत्यर्थः । कथमिति चेदुच्यते– न गतिपूर्वोऽस्तीति । गते. पूर्वो गतिपूर्वः । यस्माद्गन्ता गतेः पूर्वं सिद्धस्स्यात् स तां गतिं गच्छेत्प्राप्नुयादित्यर्थः । यथा देवदत्तो ग्रामान्तरं तद्वत । नचैवं यया गत्या गन्तेत्युच्यते तस्या गतेः पूर्वं सिद्धरूपो गतिनिरपेक्षो गन्ता नामास्ति यस्तां गच्छेदिति भावः ॥२१॥

अथ यया गत्या गन्तेत्युच्यते देवदत्तस्तामेवासौ न गच्छति, किंत्वन्यां गतिमितिचेन्नैतदपि युक्तमित्याह—

गत्या ययोच्यते गन्ता ततोन्यां स न गच्छति ।
गती द्वे नोपपद्येते यस्मादेकः प्रगच्छति ॥२२॥

यया गत्या गन्तेत्युच्यते स गन्ता ततोऽन्यामपि गतिं न गच्छति गतिद्वयप्रसङ्गात् । नह्येकस्मिन्कर्तर्येकदा गतिद्वयमस्तीत्ययुक्तमेतत् ॥२२॥

किंच—

सद्भूतो गमनं गन्ता त्रिप्रकारं न गच्छति ।
नाऽसद्भूतोऽपि गमनं त्रिप्रकारं स गच्छति ॥२३॥

सद्भूतः=गमिक्रियया युक्त; असद्भूतः=गमिक्रियारहित; सदसद्भूतः=उभयपक्षीयः; एवं गमनमपि गमिक्रियायोगात्त्रिप्रकारं वेदितव्यम् । तथा च सद्भूतो गन्ता त्रिप्रकारं सद्भूतमसद्भूतं सदसद्भूतं वा गमनं गच्छति । एतच्च कर्मकारकपरीक्षायामुच्यते । एवमसद्भूतोपि गन्ता त्रिप्रकारं गतं न गच्छति । एवं सदसद्भूतोपि गन्ता । एतदपि तत्रैव प्रतिपादयिष्यते । एवमेव वक्ता वाचं वदति, कर्ता क्रियां करोतीत्यत्रापि द्रष्टव्यम् ॥२३॥

यस्मादेवं गन्तृ गन्तव्य गमनानि न सन्ति—

सदसद्भूतोपि गन्ता त्रिप्रकारं न गच्छति ।
तस्माद्गतिश्च गन्ता च गन्तव्यं च न विद्यते ॥२४॥

निगदव्याख्यातमेतत् ॥२४॥

इति सुबोधिनीव्याख्यासहित माध्यमिककारिकासु
गतिपरीक्षा नाम द्वितीयं प्रकरणम् ।

---

सुबोधिनीव्याख्या सहित-

# माध्यमिककारिकासु

## आयतनपरीक्षानाम तृतीयं प्रकरणम् ।

ननु गन्तृगन्तव्यगमनानि न सन्तीत्युक्तम् । तथापि द्रष्टृद्रष्टव्यदर्शनानि सन्ति । तथाचोक्तम्– 'दर्शनं श्रवणं घ्राणं रसनं स्पर्शनं मनः । इन्द्रियाणि षडेतेषां द्रष्टव्यादीनि गोचरः ॥' इति ॥ अत्र यथादर्शनं रूपं न पश्यति तथा प्रतिपादयन्नाह—

दर्शनं हि स्वमात्मानं कदाचिदपि पश्यति ।
न पश्यति यदात्मानं कथं द्रक्ष्यति तत्परान् ॥१॥

पश्यतीति दर्शनं चक्षुः, तच्च स्वात्मानं न पश्यति स्वात्मनि क्रियाविरोधात् । तथा च स्वात्मनोऽदर्शनान्नीलादिकमपि न पश्यति । तस्मान्नास्ति दर्शनम् । अत्राह– यद्यपि दर्शनं स्वात्मानं न पश्यति, तथाप्यग्निवद्भवति । यथाग्निः स्वात्मानं न दहति किं तु परानेव । एवं दर्शनमपि स्वात्मानं न पश्यति किं तु परानेवेति ॥१॥

एतदप्ययुक्तमित्याह—

न पर्याप्तोऽग्निदृष्टान्तो दर्शनस्य प्रसिद्धये ।
स दर्शनः प्रतिक्षिप्तो गम्यमानगतागतैः ॥२॥

योयमग्निदृष्टान्तो दर्शनस्य प्रसिद्धये भवतोपन्यस्तः स न पर्याप्तो न समर्थ इत्यर्थः । कुतः– यतस्सोयमग्निदृष्टान्तो सदर्शनः दर्शनेनसह प्रतिक्षिप्तो दूषितः । कथं तत्राह—गम्यमानगतागतैरिति । तथाहि 'न गतं गम्यते तावदगतं नैव गम्यते' इत्याद्यभिहितम् । एवं 'न दग्धं दह्यते तावददग्धं नैव दह्यते' इत्यादि वाच्यम् । एवमेव 'न दृष्टं दृश्यते तावददृष्टं नैव दृश्यते । दृष्टादृष्टविनिर्मुक्तं दृश्यमानं न दृश्यते ॥' इत्यादि वाच्यम् । तथैव– 'दर्शनं

पश्यते तावन्नैव पश्यत्यदर्शन' मित्याद्यपि वाच्यम्। तथा च दर्शनसिद्धये योय-मग्निदृष्टान्तो भवतोपक्षिप्तस्सोपि दार्ष्टान्तिकेन सह प्रतिक्षिप्तो वेदितव्यः ॥२॥

यदा चैवमपश्यन्न किंचिद्भवति दर्शनम्।
दर्शनं पश्यतीत्येवं कथमेतत्तु युज्यते ॥३॥

यथा स्तम्भादिकं दृशिक्रियायोगाभावाद्दर्शनं न भवति एवं चक्षुरपि। तथा च पश्यतीति दर्शनमिति भवदुक्तं कथं घटत इति वक्तव्यम् ॥३॥

किं च पश्यतीति दर्शनमित्युक्तौ दर्शनक्रियासम्बन्धो चक्षुषि कल्पितो भवति। स च सम्बन्धो दर्शनस्वभावस्य चक्षुषः कल्प्यते? उतादर्शनस्वभा-वस्य वा? उभयथा च न घटत इत्याह—

पश्यते दर्शनं नैव नैव पश्यत्यदर्शनम्।
दर्शनाद्द्रष्टृसिद्धिस्ते कथमेवं भविष्यति। ॥४॥

व्याख्यातो दर्शनेनैव कर्ता वाप्युपगम्यताम्॥ दर्शनस्वभावस्य दृशिक्रियायुक्तस्य चक्षुषो भूयः पश्यतीति दर्शनक्रियायोगो नसम्भवति दृशिक्रिया-द्वयप्रसङ्गात्, दर्शनद्वयप्रसङ्गाच। अदर्शनस्वभावमपि न पश्यति अंगुल्यग्रव-द्दृशिक्रियारहितत्वात्। ननु पश्यतीति दर्शनमिति कर्तृसाधनं नाभ्युपगम्यते, किं तु पश्यत्यनेनेति करणसाधनम्। ततश्च यथानेन दर्शनेन करणभूतेन पश्यति स द्रष्टा विघत एव विज्ञानात्मा। तथा च द्रष्टृसद्भावाद्दर्शनं सिद्ध्य-तीति चेन्नेत्याह-व्याख्यात इत्यादि। यथा 'दर्शनं हि स्वमात्मान' मित्यादिना दर्शनस्य दूषणमुक्तमेवम्—'स्वमात्मानं नैव द्रष्टा दर्शनेन विपश्यति। न पश्यति यदात्मानं कथं पश्यति तत्परान्॥' इत्यादिना द्रष्टर्यपि दूषणं द्रष्टव्यम् ॥४॥

ननु विद्यत एव द्रष्टा तत्कर्मकरणसद्भावात्। द्रष्टुर्हि करणं चक्षुः, द्रष्टव्यं च कर्म। तस्माद्विद्यमानकर्मकरणो द्रष्टाऽस्त्येवेतिचेत्स किं दर्शनं तिर-स्कृत्य द्रष्टा, उताऽतिरस्कृत्येति वक्तव्यम्। उभयथापि नोपपद्यत इत्याह—

नास्ति द्रष्टाऽतिरस्कृत्य तिरस्कृत्यापि दर्शनम्।
द्रष्टव्यं दर्शनं चैव द्रष्टर्यसति ते कुतः? ॥५॥

यदि द्रष्टा नाम कश्चित्स्यात्स दर्शनसापेक्षो वा स्याद्दर्शननिरपेक्षो वा। तत्र यदि दर्शनसापेक्षो द्रष्टा स्यात्तदा अतिरस्कृत्य दर्शनमित्युच्यते। तन्न सम्भवति। तथाहि– किं सिद्धस्य दर्शनापेक्षा? उताऽसिद्धस्य? तत्र सिद्धस्य दर्शनापेक्षा नास्ति- सिद्धत्वादेव तस्य दर्शनान्तरापेक्षाया अभावात्। तिरस्कृत्यापि दर्शनं द्रष्टा नास्ति। दर्शननिरपेक्षस्य तस्य द्रष्टृत्वमेव नास्तीत्युक्तं प्राक्। तदेवं द्रष्टर्यसति निर्हेतुके द्रष्टव्यदर्शने कथं सेत्स्यतः? ॥५॥

ननु द्रष्टव्यं दर्शनं चास्ति, तत्कार्यसद्भावात्। द्रष्टव्यं दर्शनं च प्रतीत्य द्रष्टुः विज्ञानमुत्पद्यते, त्रयाणां सन्निपातात्। विज्ञानस्पर्शवेदनातृष्णाख्यं विज्ञानादिचतुष्टयं कार्यं, तत्कारणं द्रष्टव्यदर्शनादि। तस्मादस्ति द्रष्टव्यं दर्शनं चेति। तत्राह—

द्रष्टव्यदर्शनाभावाद्विज्ञानादिचतुष्टयम्।
नैवास्ति तदुपादानं भविष्यति कथं पुनः ॥६॥

स्यातामेते, यदि विज्ञानादिचतुष्टयं स्यात्। तदेव नास्ति। तद्धेतुभूतद्रष्टव्यदर्शनादेरभावात्। यदा चैवं विज्ञानादिचतुष्टयमसिद्धं तदा तद्धेतुकमुपादानं- भवजातिजरामरणादिकमपि न सिद्ध्यतीति भावः ॥६॥

इदानीमायतनान्तराण्यपि दर्शनवदेव प्रत्याख्यातव्यानीत्युक्तां सरणिमतिदिशति—

व्याख्यातं श्रवणं घ्राणं रसनं स्पर्शनं मनः।
दर्शनेनैव जानीयाच्छ्रोतृश्रोतव्यकारि च ॥७॥

यथा द्रष्टा द्रष्टव्यं दर्शनं च नास्ति। एवं श्रोता, श्रोतव्यं, श्रवणं च नास्ति। एवं घ्रातृघ्रातव्यघ्राणानि न सन्ति। रसयितृरस्यरसनानि, स्प्रष्टृस्प्रष्टव्यस्पर्शनानि, मन्तृमन्तव्यमानसानि च न सन्तीति भावः ॥७॥

इति सुबोधिनीव्याख्यासहितमाध्यमिककारिकासु
आयतनपरीक्षानाम तृतीयं प्रकरणम् ॥

———

# माध्यमिककारिकासु,

## स्कन्धपरीक्षानाम चतुर्थं प्रकरणम्।

ननु सन्ति स्कन्धास्तेषामप्रतिषेधात्। तथा च तदन्तर्गतान्यायतनान्यपि सन्त्येवेतिचेत्तत्र रूपस्कन्धमधिकृत्योच्यते—

रूपकारणनिर्मुक्तं न रूपमुपलभ्यते।
रूपेणापि न निर्मुक्तं दृश्यते रूपकारणम् ॥१॥

तत्र रूपं भौतिकं, तत्कारणं चत्वारि महाभूतानि, तन्निर्मुक्तं- तद्व्यतिरिक्तम्, रूपं, रूपरसगन्धस्पर्शशब्दाख्यं नोपलभ्यते। घटादिव्यतिरिक्त इव पटः। एवं रूपादिव्यतिरिक्तं रूपकारणमपि नोपलभ्यते ॥१॥

तदेतत्प्रतिज्ञाद्वयं प्रसाधयितुमाह—

रूपकारणनिर्मुक्ते रूपे रूपं प्रसज्यते।
अहेतुकं नचास्त्यर्थः कश्चिचाहेतुकः क्वचित् ॥२॥

यथा घटादर्थान्तरभूतः पटः न घटहेतुकः, एवं रूपस्य यत्कारणं भूतचतुष्टयं, तस्माद्यदि रूपं पृथग्भूतं स्यात्तदा तद्धेतुकं न स्यात्। तथा च रूपमहेतुकं स्यात्। निर्हेतुकश्चार्थो लोके नास्ति। तस्मादहेतुकत्वपसङ्गाद्रूपं रूपकारणनिर्मुक्तं नाङ्गीकर्तव्यमिति भावः ॥२॥

इदानीं रूपकारणनिर्मुक्तं रूपमपि नास्तीत्याह—

रूपेण तु विनिर्मुक्तं यदि स्याद्रूपकारणम्।
तदा कार्यं कारणं स्यान्नास्त्यकार्यं च कारणम् ॥३॥

यदि कार्यभूतात् रूपाद्भिन्नं रूपकारणं स्यात्तदा रूपं प्रति तस्य कारणत्वमेव न स्यात्। यथा घटात्पृथग्भूतो पटः घटं प्रत्यहेतुस्तद्वद्। एवं सति कारणं कार्यशून्यं स्यात्। कार्यशून्यं च कारणं नास्ति ॥३॥

किंच यद्रूपस्य कारणमिष्यते तत्सति वा रूपे कारणमसति वा रूपे कारणम्? उभयथापि नोपपद्यत इत्याह—

रूपे सत्येव रूपस्य कारणं नोपपद्यते।
रूपेऽसत्येव रूपस्य कारणं नोपपद्यते ॥४॥

यदि रूपं सत् तदा तत्र कारणपरिकल्पनं व्यर्थम्। रूपस्य विद्यमानत्वात्तस्य कारणापेक्षाया अभावात्। एवमसत्यपि रूपे कारणापेक्षा नास्ति, असत्वादेव। न हि वन्ध्यापुत्रस्य कारणापेक्षाऽस्ति ॥४॥

ननु रूपकारणस्याऽभावेपि रूपमस्तीतिचेदाह—

निष्कारणं पुना रूपं नैव नैवोपपद्यते।
तस्माद्रूपगतान् कांश्चिद्विकल्पान्न विकल्पयेत् ॥५॥

एवमसति कारणे निष्कारणं रूपमपि नास्ति। अत्र सावधारणेन निषेधद्वयेनाऽहेतुकवादस्यात्यन्तमसङ्गतत्वं दर्शितम्। यस्मादेवं सर्वथा विचार्यमाणं रूपं न सम्भवति तस्मात्तत्त्वदर्शी योगी रूपगतान्सर्वानपि नीलपीतादिविकल्पान्न परिकल्पयेदिति भावः ॥५॥

अपिचेदं रूपस्य कारणमिष्यमाणं स्वसदृशं कार्यं जनयेदसदृशं वा? उभयथापि न सम्भवतीत्याह—

न कारणस्य सदृशं कार्यमित्युपपद्यते।
न कारणस्याऽसदृशं कार्यमित्युपपद्यते ॥६॥

तत्र रूपस्य कारणं कठिनद्रवेरणस्वभावं भूतेषु भौतिकं चक्षुराद्याध्यात्मिकं चक्षुर्विज्ञानमाद्यं रूपाद्याश्रयं च बाह्यम्। एवं च रूपस्य तत्कारणानां च परस्परं भिन्नस्वभावत्वात् सादृश्यं नास्ति। अतः कारणस्य सदृशं कार्यमिति न शक्यते वक्तुम्। नापि विसदृशं कार्यं- अत्यन्तविलक्षणयोः कार्यकारणभावाऽयोगात्। संसारनिर्वाणवदिति भावः ॥६॥

यथा चेदं रूपं विचार्यमाणं सर्वथैव नोपपद्यते तथा वेदनादयोपीत्यतिदिशति—

वेदना चित्तसंज्ञानां संस्काराणां च सर्वशः।
सर्वेषामेव भावानां रूपेणैव समः क्रमः ॥७॥

वेदनादिकं सर्वमपि रूपविचारेणैव रूपवदेव सर्वथा विचार्यमाणं नास्तीति वेदितव्यम्। यथैवह्येकस्य धर्मस्य शून्यता प्रतिपादयितुमिष्टा माध्यमिकानां तथैव सर्वभावानामिति वेदितव्यमिति भावः ॥७॥

एवं च—

विग्रहे यः परीहारं कृते शून्यतया वदेत्।
सर्वं तस्यापरिहृतं समं साध्येन जायते ॥८॥

शून्यवादमाश्रित्य विग्रहे परपक्षदूषणे कृते सति यः परिहारं वदेत्। यथा वेदनादयोऽस्सन्ति तथा रूपमप्यस्तीति ब्रूयात्तस्य सर्वमप्यपरिहृतमेव भवति। कथं– यथा रूपं स्वकारणात्तत्त्वान्यत्वेन विचार्यमाणमसत्। एवं विज्ञानवेदनासंस्कारादयस्सर्वेपि स्वकारणेभ्यस्तत्त्वान्यत्वेन विचार्यमाणा असत्या एव भवन्ति। यथा विज्ञानादयस्साध्येन समाः, एवं लक्ष्यलक्षणकार्यकारणाऽवयव्यवयवादयोपि भावास्साध्येन समा इति कुतः परस्य परिहारः ॥८॥

यथा परपक्षदूषणे विहितोयं विधिः तथा व्याख्यानकालेपीत्याह—

व्याख्याने य उपालम्भं कृते शून्यतया वदेत्।
सर्वं तस्याऽनुपालब्धं समं साध्येन जायते ॥९॥

एवं शून्यवादमाश्रित्य व्याख्याने कृते यः कश्चिच्छिष्यदेशीयः कंचिदुपालम्भमपि ब्रूयात्तदपि यत्नेनोपालब्धं साध्येन सममिति वेदितव्यम्। यथा चोपक्रान्तं साध्यं तत्त्वेन विचार्यमाणमसत्, एवं शिष्यदेशीयेन कृतमुपालम्भनमपीति भावः ॥९॥

इति सुबोधिनीव्याख्यासहितमाध्यमिककारिकासु
स्कन्धपरीक्षानाम चतुर्थं प्रकरणम् ॥

---

# माध्यमिककारिकासु,

## धातुपरीक्षानाम पञ्चमं प्रकरणम् ।

नन्वप्रतिषेधाद्धातवस्सन्ति, उक्तं च भगवता—'षड्धातुरयं पुरुषपुद्गलः' इति । अत्रोच्यते—

नाकाशं विद्यते किंचित्पूर्वमाकाशलक्षणात् ।
अलक्षणं प्रसज्येत स्यात्पूर्वं यदि लक्षणात् ॥१॥

तत्र तावत्पृथिव्यप्तेजोवाय्वाकाशविज्ञानाख्याः षड्धातव उक्ताः । तत्राकाशमधिकृत्योच्यते दूषणम् । इह खल्वाकाशस्यानावरणं लक्षणमुच्यते । यदि लक्षणात्पूर्वमाकाशं विद्यते तत्रेदं लक्षणं प्रवर्तेत । न च तदस्ति । लक्षणात्पूर्वं यदि तदस्ति तदा तदलक्षणमेव स्यात् ॥१॥

अलक्षणो न कश्चिच्च भावस्संविद्यते क्वचित् ।
असत्यलक्षणे भावे क्रमतां कुत्र लक्षणम् ॥२॥

लक्षणप्रवृत्तेः पूर्वमलक्षणः कोपि भावः कुत्रापि नास्ति । तथा चालक्षणे भावेऽविद्यमाने सति कुत्र लक्षणं प्रवर्तते । न कुत्रापीति भावः ॥२॥

किंचेदं लक्षणं प्रवर्तमानं सलक्षणे वा भावे प्रवर्तति? उताऽलक्षणे? उभयथापि न घटत इत्याह—

नाऽलक्षणे लक्षणस्य प्रवृत्तिर्न सलक्षणे ।
सलक्षणाऽलक्षणाभ्यां नाप्यन्यत्र प्रवर्तते ॥३॥

अलक्षणे लक्षणस्य प्रवृत्तिरिति न शक्यते वक्तुम् । अलक्षणो भाव एव नास्ति । यत्र लक्षणं प्रवर्तेत । तस्मादलक्षणे लक्षणस्य प्रवृत्तिरिति न शक्यते वक्तुम् । नापि सलक्षणे भावे । लक्षणप्रवृत्तेः प्रागेव स भावः सलक्षणः । तादृशे च भावे किं लक्षणप्रवृत्त्या फलम् । तस्मात्सलक्षणेपि भावे न प्रवर्तते लक्षणम् । सलक्षणाऽलक्षणविलक्षणे भावे लक्षणं प्रवर्तेत इत्यपि न शक्यते वक्तुम् । तादृशस्य भावस्यैवाऽप्रसिद्धेः ॥३॥

यद्यप्येवं लक्षणस्य प्रवृत्तिर्नास्ति, तथापि लक्ष्यमस्तीति चेदत्रोच्यते—

लक्षणाऽसम्प्रवृत्तौ च न लक्ष्यमुपपद्यते ।
लक्ष्यलक्षणनिर्मुक्तः नैव भावोपि विद्यते ॥४॥

यदा लक्षणस्य प्रवृत्तिर्नास्ति तदा कथं लक्ष्यं स्यात् । लक्षणप्रवृत्तिमन्तरा न लक्ष्यं सिद्ध्यतीति भावः । यदा च लक्ष्यमेव न सिद्ध्यति तदा निराश्रयत्वाल्लक्षणमपि न सिद्ध्यति । यद्यप्युक्तरीत्या लक्ष्यलक्षणे न स्तः । तथाप्याकाशमस्ति भावरूपमितिचेत्तत्राह— लक्ष्यलक्षणनिर्मुक्तो भावो न कोप्यस्ति लोके ॥४॥

नन्वाकाशं यदि भावरूपं न भवति तर्ह्यभावरूपं भविष्यतीति चेदेतदप्ययुक्तमित्याह—

अविद्यमाने भावे च कस्याभावो भविष्यति ।
भावस्य ह्यन्यथाभावमभावं ब्रुवते जनाः ॥५॥

यदा आकाशं भावो न भवति तदा अभावोपि न भवितुमर्हति । यतो भावस्यैवाऽन्यथाभावं, तिरोहितं भावमेवाभावमिच्छन्ति, ततो भावस्याविद्यमानतायामभावोपि नास्तीति भावः ॥५॥

ननु भावाभावयोः परीक्षकस्य सद्भावाद्विद्येतएव भावाभावावित्यत आह—

भावाभावविधर्मा च कश्चिद्धर्मो न विद्यते ।
भावाभावविधर्मा च भावोऽभावश्च वेति कः ॥६॥

यो यः परीक्षकः स भावरूपो वा स्यादभावरूपो वा, भावाभावविलक्षणो वा? सर्वथापि नोपपद्यते । भावाभावपक्षयोः दूषणं प्रागेवाभिहितम् । भावाभावविलक्षणो धर्म एव नास्ति यतः, अतो भावाभावविलक्षणः परीक्षको नास्ति । तदभावाद्भावोपि नास्ति । अभावोपि नास्तीत्यर्थः ॥६॥

यत एवम्—

तस्मान्न भावो नाऽभावो न लक्ष्यं नापि लक्षणम् ।
आकाशमाकाशसमा धातवः पञ्च ये परे ॥७॥

आकाशं भाव इति वा, अभाव इति वा, लक्ष्यमिति वा, अलक्ष्यमिति वा वक्तुं न शक्यते । सर्वत्र दूषणाभिधानात् । यथाचेदमाकाशमेकमेवं पृथि-

व्यादयोऽप्यवशिष्टाः पञ्च धातवोऽपि विज्ञेयाः । तत्राप्याकाशेऽभिहितदूषणप्रसङ्गात् ॥

तदेवं पदार्थानां स्वभावे निरूपितेऽपि अविद्यातिमिरोपहतमतिनयनतया अनादिप्रवृत्तसंसारार्णवनिमग्नतया च परनिर्वाणानुगमविपरीतेन भवाभावविपरीतदर्शनेन सन्मार्गपरिभ्रष्टा इत्याक्रोशन्नाह—

अस्तित्वं ये तु पश्यन्ति नास्तित्वं चाल्पबुद्धयः ।
भावानां ते न पश्यन्ति द्रष्टव्योपशमं शिवम् ॥८॥

सर्वकल्पनाजालरहितं, ज्ञानज्ञेयनिवृत्तिस्वभावं, अजरममरमप्रपञ्चस्वभावं, शून्यतारूपं, परनिर्वाणं ते न पश्यन्ति । मन्दप्रज्ञतया भावानामस्तित्वे नास्तित्वे चाभिनिविष्टा इति भावः ॥८॥

इति सुबोधिनीव्याख्यासहितमाध्यमिककारिकासु
धातुपरीक्षानाम पञ्चमं प्रकरणम् ॥

---

सुबोधिनीव्याख्यासहित-

# माध्यमिककारिकासु,

## रागरक्तपरीक्षानाम षष्ठं प्रकरणम् ।

ननु सन्त्येव स्कन्धायतनधातवः, कुतः? तदाश्रयस्य रागादेः, तन्निबन्धनस्य संक्लेशस्य च सत्त्वादिति चेदुच्यते— इहाऽयं परिकल्प्यमानो रागः सत्येव रक्ते परिकल्प्यते? उताऽसति रक्ते? उभयथापि न सम्भवतीत्याह—

रागाद्यदि भवेत्पूर्वं रक्तो रागतिरस्कृतः ।
तं प्रतीत्य भवेद्रागो रक्तो रागो भवेत्सति ॥१॥

रागः, शक्तिः, अध्यवसानं, सङ्गः, अभिनिवेश इति पर्यायाः । रक्तो रागस्याश्रयः । स यदि रागोत्पत्तेः पूर्वमेव रागेण तिरस्कृतः तर्ह्यर्हतामपि रागप्रसङ्गः । तस्माद्रक्ते रागो नास्ति । नाप्यरक्ते रागः । यदा च सति रक्ते रागो नास्ति तदाऽसति रक्ते रागः कथं भवेत् । निराश्रयत्वप्रसङ्गात् ॥१॥

ननु त्वया रागो निषिद्धः, न रक्तः, ततश्च रक्तोऽस्तीति, तत्राह—

रागेऽसति पुना रक्तः कुत एव भविष्यति ।
सति वाऽसति वा रागे रक्तेऽप्येष समः क्रमः ॥२॥

योऽयं रक्तः त्वयोच्यते स किं सति रागे इष्यते? उताऽसति रागे? उभयथापि न सम्भवति । कथम्, तत्र यदि सति रागे रक्तः परिकल्प्यते तदा 'रक्ताद्यदि भवेत्पूर्वं रागो रक्तःतिरस्कृतः' इत्यादेः प्रागभिहितस्य दूषणस्य प्रसङ्गात् । नाप्यसति रागे, रक्त इत्ययं व्यपदेशो रागमालम्ब्य भवति। रागस्यैवाभावे कथमयं रक्त इति भवति । तस्मान्नास्ति रक्त इति । एवं रागरक्तयोरभावात् स्कन्धादयोपि न सन्तीति भावः ॥२॥

ननु रागरक्तयोः पौर्वापर्येण सम्भवो नास्ति, किं तर्हि सहैव । सहभूतेनैव रागेण चित्तं रज्यते । तच्च रक्तमित्युच्यते, इतिचेदत्राह—

सहैव पुनरुद्भूतिर्न युक्ता रागरक्तयोः ।
भवेतां रागरक्तौ हि निरपेक्षौ परस्परम् ॥३॥

रागरक्तयोस्सहोत्पादोपि न युक्तः । तथासति सव्येतरगोविषाणवद्रागरक्तौ परस्परनिरपेक्षावेव स्याताम् ॥३॥

अपि चाऽनयोः सहभाव एकत्वे वा स्यात् ? पृथक्त्वे वा ? उभयथापि न सम्भवतीत्याह—

नैकत्वे सहभावोऽस्ति न तेनैव हि तत्सह ।
पृथक्त्वे सहभावोऽथ कुत एव भविष्यति ॥४॥

रागरक्तयोरेकत्वे सहभावो नास्ति । कुतः? उच्यते– **न तेनैवेति**। न हि रागात्मा रागेणाऽव्यतिरिक्तो रक्तो रागेण सहेति शक्यते वक्तुम् । तयोः पृथक्त्वेपि सहभावो न सम्भवति । न हि पृथग्भूतयोस्तेजस्तिमिरयोः, संसारनिर्वाणयोर्वा सहभावोऽस्तीति भावः ॥४॥

किंच—

एकत्वे सहभावश्चेत्स्यात्सहायं विनापि सः ।
पृथक्त्वे सहभावश्चेत्स्यात्सहायं विनापि सः ॥५॥

यद्येकत्वेपि सहभाव इष्यते तर्हि सहायं विनाप्येकस्यैव तस्य तेन सहभावः प्राप्नोति। नचैवं सम्भवति। यदि पृथक्त्वे सहभावः, तदा यत्र यत्र पृथक्त्वं तत्र तत्र सहभाव इति व्याप्त्या अश्वादिव्यतिरिक्तस्य गवादेरश्वात्पृथग्भावस्य सत्त्वादश्वादिकं विनैव गोरश्वादिसहभावस्स्यात्। स च नास्त्येव ॥५॥

किंच—

पृथक्त्वे सहभावश्चेद्यदि वा रागरक्तयोः।
सिद्धः पृथक्पृथग्भावः सहभावस्ततस्तयोः ॥६॥

लोके पृथक्सिद्धयोरेव गवाश्वयोस्सहभावो दृश्यते। तद्वदेव रागरक्तयोरपि पृथक्त्वे सहभावो वक्तव्यः। यदा च रागरक्तयोः पृथक्पृथग्भावः सिद्धस्स्यात्तदा तयोस्सहभावः स्यात्। नहि गवाश्वयोरिव रागरक्तयोः पृथग्भावोऽस्ति ॥६॥

किंच—

सिद्धः पृथक्पृथग्भावः यदि वा रागरक्तयोः।
सहभावं किमर्थं तु परिकल्पयसे तयोः ॥७॥

रागरक्तयोः सिद्ध्यर्थं तयोस्सहभावः कल्प्यते। स च पृथगसिद्धयोर्नास्तीति तयोः पृथग्भावोऽप्यङ्गीक्रियते यदा तदा रागरक्तयोः पृथग्भावस्य सिद्धत्वात्पुनः तयोः पृथक्पृथक्सिद्धयोः सहभावपरिकल्पनं निरर्थकमेवेति भावः॥७॥

किंच सहभावसिद्ध्यधीना पृथग्भावसिद्धिः, तदधीना च सहभावसिद्धिरित्यन्योन्याश्रयादिदोषप्रसङ्ग इत्याह—

पृथग्भावप्रसिद्ध्यर्थं सहभावं विकांक्षसि।
सहभावप्रसिद्ध्यर्थं पृथक्त्वं भूय इच्छसि ॥८॥

सहभावमन्तरा पृथग्भावो न सिद्ध्यतीति पृथग्भावसिद्ध्यर्थं सहभावोऽङ्गीक्रियते। एवं पृथगसिद्धयोः सहभावोपि नास्तीति सहभावसिद्धये पृथग्भावोऽङ्गीक्रियत इति परस्पराधीनसिद्धिकयोस्सहभावपृथग्भावयोरङ्गीकारे अन्योन्याश्रयदोषो दुरुद्धर एव ॥८॥

पृथग्भावाप्रसिद्धेश्च सहभावो न सिद्ध्यति।
कतमस्मिन्पृथग्भावे सहभावं सतीच्छसि ॥९॥

एवं पृथग्भावस्याऽसिद्धत्वाद्रागरक्तयोस्सहभावोऽपि न सिद्ध्यति। यस्मिन्पृथग्भावे सति सहभावमिच्छति भवान्स पृथग्भावो गगनकुसुमकल्प इति भावः॥

तदेवमुक्तविचारे क्रियमाणे रागरक्तयोस्सिद्धिर्न सम्भवतीति निगमयन्नाह-

एवं रक्तेन रागस्य सिद्धिर्न सह नाऽसह।
रागवत्सर्वधर्माणां सिद्धिर्न सह नाऽसह ॥१०॥

यथा च रागरक्तयोः पृथग्वा सह वा सिद्धिर्नास्ति, एवमेव द्वेषद्विष्ट-मोहमूढानामपि सिद्धिस्सह वा, पृथग्वा न सम्भवति। तदेवं रागद्वेषमोहानां स्वभावं ज्ञात्वा सङ्कल्पहेतुजनितं वितथप्रपंचं ये न विकल्पयन्ति तेषां सर्वभव-भावविभावितानामाशु परनिर्वाणसिद्धिरिति भावः ॥१०॥

इति सुबोधिनीव्याख्यासहितमाध्यमिककारिकासु
रागरक्तपरीक्षानाम षष्ठं प्रकरणम् ॥

---

सुबोधिनीव्याख्यासहित-

# माध्यमिककारिकासु,

## संस्कृतपरीक्षानाम सप्तमं प्रकरणम्।

ननु विद्यन्त एव स्कन्धायतनधातवः, तल्लक्षणोपदेशात्। उक्तं हि भगवता—'त्रीणीमानि संस्कृतस्य लक्षणानि' इत्यादि। तस्मात्संस्कृतलक्षणोपदे-शात् सन्ति स्कन्धादयः। अत्राह—

यदि संस्कृत उत्पादस्तत्र युक्ता त्रिलक्षणी।
अथाऽसंस्कृत उत्पादः कथं संस्कृतलक्षणम् ॥१॥

इहायमुत्पादः संस्कृतलक्षणत्वेनेष्यमाणः संस्कृतो वा तल्लक्षणत्वेनेष्यते, असंस्कृतो वा? यदि संस्कृतस्तदा उत्पादेपि त्रिलक्षणी स्यात्। त्रयाणां लक्षणाना समाहारस्त्रिलक्षणी। उत्पादस्थितिभङ्गानां समाहारः। अयञ्चोत्पादस्थितिभङ्ग-

समाहारः सर्वसंस्कृतसाधारणः। तथाचोत्पादस्यापि संस्कृतत्वे तत्रापि त्रिलक्षणी प्रसज्येत। तदानीमुत्पादोपि रूपादिवल्लक्ष्यमेव स्यान्न लक्षणमिति भावः। अथाऽसंस्कृत उत्पादः तदा असंस्कृतत्वादेवाकाशादिवल्लक्षणमेव संस्कृतस्य न स्यात् ॥१॥

अपि चेमे उत्पादादयः संस्कृतस्य लक्षणत्वेन परिकल्प्यमाना व्यस्ता वा लक्षणत्वेन परिकल्प्येरन्, समस्ता वा? उभयथा च न युज्यत इत्याह—

उत्पादाद्याः त्रयो व्यस्ता नालं लक्षणकर्मणि।
संस्कृतस्य समस्तास्स्युः कथमेकत्र चैकधा ॥२॥

व्यस्तानामुत्पादादीनां लक्षणत्वं न सम्भवति। कथम्? यद्युत्पादकाले स्थितिभङ्गौ न स्तः, तदा स्थितिभङ्गरहितस्योत्पादस्याकाशस्येव संस्कृतलक्षणत्वं न युक्तम्। अथ स्थितिकाले उत्पादभङ्गौ यदि न स्तः तदोत्पादभङ्गरहितायाः स्थितेर्नास्ति सम्भवः। उत्पादस्थितिरहितस्य पदार्थस्यैवाऽसम्भवात्। तथा च खपुष्पवदविद्यमानस्य तस्य कथं लक्षणत्वम्। किंच स्थितियुक्तस्य पश्चाद्भङ्ग इत्यप्ययुक्तम्। भङ्गविरोधिधर्माक्रान्ते भावे भङ्गाऽसम्भवात्। उत्पादस्थितिरहितस्य भङ्गाभावाद्भङ्गस्यापि केवलस्य न लक्षणत्वमिति न व्यस्तानां लक्षणत्वसम्भवः।

इदानीं समस्तानामपि न लक्षणत्वं सम्भवतीत्याह—संस्कृतस्येत्यादिना। एकस्मिन्पदार्थे एकस्मिन्नेव काले परस्परविरुद्धत्वादुत्पादस्थितिभङ्गानामालोकान्धकारवत्सम्भवो नास्ति यतस्ततस्समस्तानामपि तेषां न संस्कृतलक्षणत्वं सम्भवतीति भावः ॥२॥

अथान्यदेवोत्पादादिकं संस्कृतलक्षणमित्यत्राह—

उत्पादस्थितिभङ्गानामन्यत्संस्कृतलक्षणम्।
अस्ति चेदनवस्थैवं नास्ति चेत्तेन संस्कृताः ॥३॥

यद्युत्पादस्थितिभङ्गानामन्यदुत्पादादिकं संस्कृतलक्षणमित्युच्यते, तदा तत्र तत्रान्यदन्यदुत्पादादिकं कल्पयितव्यमित्यनवस्थादोषो दुरुद्धरः। यदि चोत्पादादीनामन्यदुत्पादादिकं नास्ति तदा असंस्कृता एवोत्पादादय इति कथमसंस्कृतानां तेषां संस्कृतलक्षणत्वमिति पूर्वोक्त एव दोष इति भावः ॥३॥

ननु सन्त्येवोत्पादादीनामुत्पादादयः, नचैवमनवस्थादोषप्रसङ्गोपि-लक्षणाऽनुलक्षणानां परस्परमुत्पादकत्वात्। तथा हि, इह मौलो धर्म उत्पद्यमानः सपरिवार एवोत्पद्यते। उत्पद्यमानस्य च धर्मस्य उत्पादः, समन्वागमः, स्थितिः, जरा, अनित्यता, मिथ्याविमुक्तिः, सम्यग्विमुक्तिः, नैर्वाणिकता, अनैर्वाणिकतेति एष परिवारः। तत्र च योऽयं मौल उत्पादः स आत्मानं विहाय उत्पादोत्पादाद्यनैर्वाणिकतापर्यन्तस्य परिवारस्योत्पादकः। उत्पादोत्पादस्तु मौलस्योत्पादस्येति नास्त्यनवस्थाया अवकाश इत्याह—

उत्पादोत्पाद उत्पादो मौलोत्पादस्य केवलम्।
उत्पादोत्पादमुत्पादो मौलो जनयते पुनः ॥४॥

द्विविधश्चोत्पादः— एको मौलोत्पादः, अपरश्चोत्पादोत्पादसंज्ञकः। तत्र योयमुत्पादोत्पादसंज्ञक उत्पादस्स मौलोत्पादस्य केवलमुत्पादकः। मौलोत्पादस्तु उत्पादोत्पादसंज्ञकस्योत्पादस्योत्पादकः। एवं परस्परमुत्पादकल्पने नास्त्यनवस्थावकाश इति भावः ॥४॥

अत्रोच्यते—

उत्पादोत्पाद उत्पादो मूलोत्पादस्य ते यदि।
मौलेनाऽजनितस्तं ते स कथं जनयिष्यति ॥५॥

यदि नामोत्पादोत्पादसंज्ञक उत्पादो मौलमुत्पादं जनयिष्यतीति ते मतं तदा मौलोत्पादेनाऽजनित उत्पादोत्पादः कथं मौलमुत्पादं जनयिष्यतीति वक्तव्यम्॥

नन्वादावेव मौलोत्पादेन जनित उत्पादोत्पादो मौलमुत्पादं जनयिष्यतीत्यत्राह—

स ते मौलेन जनितः मौलं जनयते यदि।
मौलश्च तेनाऽजनितस्तमुत्पादयते कथम् ॥६॥

स उत्पादोत्पादसंज्ञित उत्पादो मौलमुत्पादं जनयतीति यदि ते मतं, तदा उत्पादोत्पादसंज्ञकेनोत्पादेनाऽजनितो मौल उत्पादः उत्पादोत्पादसंज्ञकमुत्पादं कथं जनयेत्। खपुष्पवदविद्यमानत्वादिति भावः ॥६॥